ANGANWADI VOICE MONTHLY

# అంగన్‌వాడి వాయిస్



స్వరం మీది - పోరాటం మాది

సామాజిక ప్రజా చైతన్య మాసపత్రిక

సంపుటి - 5 సంచిక - 1 మార్చి - 2020 MARCH 2020 వెల : 20/-

## అంతర్జాతీయ మహిళా దినోత్సవ శుభాకాంక్షలు



వార్షికోత్సవ ప్రత్యేక సంచిక




నాలుగు సంవత్సరాలుగా ఆదరిస్తున్న విజ్ఞులైన పాఠకులకు, ప్రకటనకర్తలకు వార్షికోత్సవ శుభాకాంక్షలు...

డి. ఉదయభాస్కర్
ఎడిటర్






# 'అంతర్జాతీయ మహిళా దినోత్సవ శుభాకాంక్షలు

# 'అంగన్‌వాడీ వాయిస్'కి వార్షికోత్సవ శుభాకాంక్షలు





## ప్రియమైన మంత్రివర్యులకు, అధికారులకు, అనధికారులకు, ప్రజాప్రతినిధులకు, మహిళా శిశు సంక్షేమ శాఖ సిబ్బందికి అంతర్జాతీయ మహిళా దినోత్సవ శుభాకాంక్షలు

అమ్మను పూజించు... భార్యను ప్రేమించు... సోదరిని దీవించు... ముఖ్యంగా మహిళను గౌరవించు...



## ICDS SUPERVISORS & EOs (W&CW) ASSOCIATION, ANDHRA PRADESH



(Regd. No. 3943)

D.No. 54-16-3/3, Plot no-48, Road no-3, Loyola Gardens, Opp. Loyola College,
VIJAYAWADA - 522 008, Ph : 95157 23198, E-mail : apicdssupervisors@gmail.com

| | | |
|---|---|---|
| **ఎ. సుబ్బరాజు**<br>గౌరవాధ్యక్షులు | **ఎం. నిహారిక**<br>ప్రెసిడెంట్ | **కె. ఉమాదేవి**<br>సెక్రటరీ |
| **సిహెచ్. కళావతి**<br>ట్రెజరర్ | **జి. ప్రశాంతి**<br>అసోసియేట్ ప్రెసిడెంట్ | **పి. అచ్యుతాంబ**<br>వైస్ ప్రెసిడెంట్ |
| **వై. సంగీత లక్ష్మి**<br>వైస్ ప్రెసిడెంట్ | **ఎస్. రేణుక**<br>వైస్ ప్రెసిడెంట్ | **ఎల్. శాంతకుమారి**<br>వైస్ ప్రెసిడెంట్ |
| **ఎ. నందేశ్వరి**<br>వైస్ ప్రెసిడెంట్ | **ఎం. ఆశారోహిణి**<br>ఆర్గనైజింగ్ సెక్రటరీ | **సి.హెచ్.వి. లక్ష్మి**<br>జాయింట్ సెక్రటరీ |
| **ఎన్. సునీతదేవి**<br>జాయింట్ సెక్రటరీ | **వి. పద్మ**<br>జాయింట్ సెక్రటరీ | **కె. రాధిక**<br>జాయింట్ సెక్రటరీ |

| | | | |
|---|---|---|---|
| **జి. రామకుమారి**<br>ఇ.సి. మెంబర్ | డాక్టర్ **రత్నకుమారి**<br>ఇ.సి. మెంబర్ | **వై. గుర్రమ్మ**<br>ఇ.సి. మెంబర్ | **కె. అంజమ్మ**<br>ఇ.సి. మెంబర్ |

అంగన్‌వాడి వాయిస్

స్వరం మీది - పోరాటం మాది

సామాజిక ప్రజా చైతన్య మాసపత్రిక

సంపుటి : 5 సంచిక : 1 ఎడిటర్ : దుద్దె ఉదయభాస్కరరావు మార్చి 2020

## విషయ సూచిక






రిపోర్టర్స్ :
మేఘనా ఉదయ్
ఎస్. మహ్మద్ రఫీ

లీగల్ అడ్వయిజర్స్ :
వాసర్ల అమర శ్రీనివాస్, అడ్వకేట్
ఫోన్ : 94405 02230

**EDITORIAL OFFICE :**
Flot No. 201,
Guru Raghavendra Enclave,
Sunkaravari Thota,
ELURU - 534 001, W.G.Dt. A.P.,
Cell : 94401 41712

Email : anganwadivoice@gmail.com

పత్రికకు సంబంధించి న్యాయపరమైన అంశాలను
ఏలూరు పరిధిలో గల జిల్లా కోర్టులోనే పరిష్కరించుకోవలెను.

OWNER, PRINTER, PUBLISHER AND EDITOR BY DUDDE UDAYABHASKARA RAO, PUBLISHED AT . D NO 5B-2-51, AMBICA CENTER, WESTERN STREET, ELURU-534 001. W.G DIST., ANDHRA PRADESH. PRINTED AT PRASANTH FLEX PRINTERS, D NO 23A-6-7, SANKARAMATHAM ROAD, R.R. PET, ELURU-534002, W G.DIST., ANDHRA PRADESH. RNI No.: APTEL 2016/71924



# ఎందుకీ వివక్ష...?

ప్రతి పనిలో ఆడ మగ మధ్య విభజన స్పష్టంగా కనిపిస్తుంది. నానాటికి సాంకేతికత కొత్త పుంతలు తొక్కుతోంది. అంతరిక్ష రహస్యాలను ఛేదించే స్థాయికి మానవ సమాజం అభివృద్ధి చెందుతోంది. అయినా ఆడవాళ్ళపై వివక్ష మంత్రం అంతలా కొన సాగడం శోచనీయం. ఆధునికతకు అలవాలం అని చెప్పుకునే నగరాల్లోనూ, ఇంట, బయటా మహిళలపై అడుగడుగునా ఆంక్షలే. ప్రాచీన భారత దేశంలో మహిళలు జీవితపు అన్ని విభాగాల్లో పురుషులతో సమాన హోదా అనుభవించారని ఎన్నో పరిశోధనల్లో తేలింది. పతాంజలి, కాత్యాయనుడు వంటి ప్రాచీన భారత వ్యాకరణకర్తలు వేదకాలపు ఆరంభంలో మహిళలు చదువుకొనేవారని చెప్పారు. ఆ సమయంలో మహిళలు యుక్తవయస్సులోనే పెళ్ళి చేసుకునే వారని వారు భర్తని ఎన్నుకునే హక్కుని కలిగి ఉండేవారని వేదాలు చెబుతున్నాయి. ఆ తర్వాత ఎన్నో మార్పులు సతీసహగమనం, బాల్యవివాహాలు దేవదాసి లాంటి అనేక వివక్షల నుంచి స్త్రీ బయట పడింది. నేటి భారతీయ మహిళ విద్య రాజకీయాలు, మీడియా, కళలు, సంస్కృతీ సేవా విభాగాలు, విజ్ఞాన సాంకేతిక రంగాలు వంటి అన్ని రంగాల్లో ముందడగు వేస్తుంది. స్త్రీల పట్ల ఎలాంటి వివక్ష చూపించకుండా భారతీయ మహిళలందరికి సమానత్వం కోసం రాజ్యాంగం అనేక చట్టాలు చేసింది. అయినా ఇంకా మార్పురాలేదనే చెప్పాలి. కట్టుబాట్లు, ఆచారాలు పేరిట ఆడవారిపై ఆంక్షలు విధిస్తూనే ఉన్నారు. కొన్ని ప్రాంతాల్లో ఇలాంటివి ఇంకా కొనసాగడంతో స్త్రీ తన ఉన్నతికి స్వేచ్ఛకు దూరమవుతుంది. ఆడవాళ్ళు అణిగిమణిగి ఉండాలి. మగవాళ్ళు పౌరుషానికి ప్రతీక వంటి స్టీరియో టైప్ ఆలోచనల్ని ఆధునిక సమాజం దాట రాలేదనడానికి నేడు జరుగుతున్న నేరాలే సాక్ష్యాలు. స్త్రీలను గౌర వించాలి అనే నినాదాలు గోడలు మీదేగాని భావితరాల గుండెల మీద లిఖించడంలో వ్యవస్థ వైఫల్యం లేదని చెప్పలేని పరిస్థితులు. ఇంకెంతకాలం ఆడ మగ తేడాలు. మగతనం కాదు మనిషితనం ముఖ్యమని భోదించే వారెవ్వరు గతి తప్పుతున్న కొందరి అబ్బాయిల బుద్ధికే ఇప్పుడు ఆంక్షలు అత్యవసరం. అసలు మహిళలను గౌరవించటానికి ఒక 'డే'నా చెప్పాలంటే ఒక జన్మ కూడా సరిపోదు. అంతర్జాతీయ మహిళా దినోత్సవం అంటే ఆ ఒక్కరోజు నాలుగు చప్పట్లు కొట్టి రేపటి నుండి ఇష్టానుసారంగా ఉండటం...ఈవాల్టి అబద్ధాన్ని ఒక జన్మంతా సాగదీయడమే. అసలు మహిళలకు మగాడు మర్యాదు ఇవ్వడమేంటి? అతడికి జన్మనిచ్చిందే మహిళ. అసలు మహిళ ఆత్మగౌరవాన్ని తగ్గించకుండా ఉంటే చాలు మహిళా విజయాలకు వంకలు పెట్టకుండా ఉంటే చాలు. మగాడి జీవితానికి బొద్దుతాడు అయిన మహోన్నత శక్తిని నులి మేయకుండా ఉంటే చాలు. తన మనుగడను తాను తెలుసుకోకుండా ఉంటే చాలు. సర్వజగత్తుకు మూలం. సహనం, ఓర్పుకు నిలువెత్తు నిదర్శనం ఆమె మానవ గమనంలో ప్రతిదశలో ఆమె పాత్ర అనివార్యం, అనిర్వచనీయం. పసిప్రాయాన అమ్మగా లాలి పాడాలి, ఆమె బడిబాటన ప్రథమ గురువై మార్గ నిర్దేశం చేయాలి. అక్కగా, చెల్లిగా, స్నేహితురాలిగా సహధర్మచారిణిగా మహిళా మూర్తి సేవలు అమోఘం. అద్భుతం అందుకే కార్యేషు దాసి, కరణేషు మంత్రి బోజ్యేషు మాతా అంటూ మన పూర్వీకులు స్త్రీమూర్తులు గొప్పతనాన్ని వెలుగెత్తి చాటారు. ఇలాంటి అమృతమూర్తులైన స్త్రీల మీద నేటికి వివక్ష కొనసాగడం దారుణం. సామాజికంగా, ఆర్థికంగా, రాజకీయంగా ఎన్నో పరిణామాలు, జీవనశైలిలో అనూహ్యమైన మార్పులు వచ్చాయి. ఒకనాటి విలాసాలు నేటి కనీస సౌకర్యాలై పోయాయి. అందానికి కొలతలు మారాయి. ఆనందానికి నిర్వచనాలు మారాయి. విలువలు విలువ తగ్గింది. కానీ స్త్రీ మూర్తి విలువ సృష్టిలో ఎప్పటికి తగ్గదు. నిఘంటువులో స్త్రీకి నారీ వనిత, మహిళ, అంగన, కామిన, ప్రమిద, మానిని, కాంత, లలన, మగువ వంటి 60 పైనే పర్యాయపదాలున్నాయి. మగాడికి పట్టుమని పది ఉన్నాయేమో బహుశా అందుకే పరస్త్రీలను తల్లులుగా, పరధనమును ముట్టివోలే భావించుటయే పరమోన్నతి సంస్కారం అని ప్రతి మగాడు భావించిననాడు స్త్రీలపై వివక్ష ఎప్పటికి ఉండదు.


అంగన్‌వాడి
వాయిస్
సామాజిక ప్రజా చైతన్య మాసపత్రిక
మార్చి 2020


ఉదయభాస్కర్ రెడ్డి

# ఎడిటర్‌గా మీతో చిన్న మాట

అంగన్‌వాడీ వాయిస్ సామాజిక ప్రజా చైతన్య మాసపత్రిక మీ అందరి ఆదరాభిమానాలు, అభినందనలతో నాలుగు వసంతాలు పూర్తి చేసుకుని 5వ వసంతంలోకి అడుగిడుతున్న శుభ తరుణంలో మీ అందరికి పేరుపేరున హృదయపూర్వక శుభాకాంక్షలు. బుడి బుడి నడకలతో ప్రారంభమైన అంగన్‌వాడీ వాయిస్ ప్రస్థానం నేడు వడివడిగా ముందుకు నడుస్తూ ఈ నెల ఐదవ వసంతంలోకి అడుగుపెడుతుందని చెప్పటానికి ఎంతో గర్వపడుతున్నాను. ఈ శుభ తరుణాన నాకు చేయూతనిచ్చిన సహృదయులు, ప్రకటనలు ఇచ్చి ప్రోత్సహించిన మహానుభావులు, ఆదరించి ప్రోత్సహించిన పాఠకులు, అభిమానులు, మిత్రులు, శ్రేయోభిలాషులు, ప్రభుత్వ అధికారులు, పాత్రికేయ మిత్రులు ఇలా ఎందరో... ఎందరెందరో.. సహాయ సహకారాలు అందించారు. వారందరికి మరోసారి శిరస్సు వంచి నమస్కరిస్తున్నాను. ప్రజాస్వామ్య వ్యవస్థలో పత్రికల పాత్ర ఎంతో కీలకమైంది. నిత్య జీవన సమరంలో జరుగుతున్న అన్యాయాలను ఎండగడుతూ ప్రజల పక్షాన నిలబడి ఎప్పటికప్పుడు తాజా సమాచారంతో జాతిని జాగృతిని చేయడంలో మీడియా పాత్ర అద్భుతం, అనిర్వచనీయం, అనన్యసామాన్యం, అమోఘం. అయితే పత్రిక నిర్వహణ ఒక యజ్ఞం లాంటిది. పెరిగిపోతున్న నిర్వహణ వ్యయం తగ్గిపోతున్న ప్రకటనలతో ఎలక్ట్రానిక్ మీడయా ప్రవాహతరంగంలో చిన్న మధ్య తరహా పత్రికలు ఉక్కిరిబిక్కిరి అవుతున్నాయి. ప్రస్తుతం ఉన్న క్లిష్ట పరిస్థితుల్లో కూడా నా అక్షరయజ్ఞానికి విజ్ఞులైన పాఠకులిచ్చే కొండంత అండతో, మాతృభాషపై ఉన్న మమకారంతో పాత్రికేయరంగంలో రెండు దశాబ్దాల అపార అనుభవంతో నిష్పక్షిక సునిశిత విశ్లేషణలతో ఇటు సమాజంలోను అటు డిపార్టుమెంటులోను "అంగన్‌వాడీ వాయిస్"కి గౌరవప్రదమైన స్థానం కల్పించాము. నీతిగా, నిజాయితీగా నిలబడ్డాం. కావున ఎల్లవేళలా ఆత్మీయులైన మీరంతా ఎప్పటిలాగానే సహాయసహకారాలు అందించాలని కోరుతున్నాను.





అభినందనలతో...
భవదీయుడు
**ఉదయభాస్కర్**
ఎడిటర్

# సంక్షేమ పథగామి...

## పౌష్టికాహారం ప్రాధాన్యతను నొక్కి చెపుతూ కేటాయింపులు

ఆరేళ్ళలోపు చిన్నారులు, కౌమార దశలోని బాలికలు, గర్భిణీలు బాలింతలకు పౌష్టికాహారం యొక్క ప్రాధాన్యతను నొక్కి చెపుతూ ప్రభుత్వం కేటాయింపులు పెంచింది. అందరికి సంపూర్ణ ఆరోగ్యం అందించాలనే ధ్యేయంతో రాష్ట్రవ్యాప్తంగా ఉన్న గిరిజన ప్రాజెక్టులలో వైఎస్ఆర్ సంపూర్ణ పోషణ కార్యక్రమాన్ని ముఖ్యమంత్రి వైఎస్ జగన్మోహనరెడ్డి ప్రవేశపెట్టారు. మహిళా శిశు సంక్షేమంపై కేంద్ర ప్రభుత్వం కూడా ప్రత్యేకంగా దృష్టి సారించి గత ఏడాది కంటే ఈ ఏడాది కేటాయింపులు పెంచింది. సామాజిక సేవా రంగానికి అగ్ర తాంబూలం ఇస్తూ చేయూత అవసరమైన ఇతర వర్గాలకు అండదండలుగా నిలవాలని కేంద్ర ప్రభుత్వం సంకల్పించి, పౌష్టికాహారం ప్రాధాన్యతను గుర్తించి 14శాతం అదనంగా కేటాయింపులు పెంచడం విశేషం. దేశం ఆర్థికంగా సంక్లిష్ట పరిస్థితులను ఎదుర్కొంటున్న తరుణంలో కూడా మహిళా శిశు సంక్షేమానికి ప్రాధాన్యతనివ్వటం సర్వత్రా హర్షం వ్యక్తమవుతుంది. బహుశా దేశంలో పెరుగుతున్న అభివృద్ధి అవకాశాలు మహిళా ప్రగతికి దోహదం చేసేలా ఉన్నాయని బాల్యవివాహాలు తగ్గి బాలికలు చదువుకోవాలని, చదువుకైనా, ఉద్యోగానికి అయినా ఉపాధికైనా ఆరోగ్యానికైనా ఆటంకంగా మారుతున్న పోషకాహార సమస్య వారిలో ఉండకూడదని ఆశిస్తూ బడ్జెట్ కేటాయింపులు పెంచారని తెలుస్తుంది. ఇది మహిళా లోకానికి ఎంతో మేలు చేస్తుంది. దానిలో భాగంగానే రాష్ట్రంలో కూడా ఏడు సమీకృత గిరిజనాభివృద్ధి సంస్థల్లోని 77 షెడ్యూల్ మరియు ట్రైబల్ సబ్ ప్లాన్ మండలాల్లో ఆరు నుండి 77 నెలల పిల్లలు గర్భిణీ స్త్రీలకు బాలింతలకు అనుబంధ పోషకాహారాన్ని అందించేందుకు వైఎస్ఆర్ సంపూర్ణ పోషణ పేరుతో కొత్త కార్యక్రమానికి శ్రీకారం చుట్టారు. వాస్తవంగా పోషకాహార లోపంతో కుంగుతున్న పిల్లల సంఖ్య భారత్‌లోనే ఎక్కువ ఉంది. దేశంలో 51 శాతం మంది మహిళలు రక్తహీనతతో బాధపడుతున్నారు. దేశంలో ప్రతి ముగ్గురు పిల్లల్లో ఒకరు గిడస బారిపోతుండగా ప్రతి ఇద్దరిలో ఒకరిని రక్తహీనత పీడిస్తుంది. ఈ తరుణంలో ఈ పథకాన్ని ప్రవేశపెట్టారు. ఇప్పటికే అంగన్‌వాడీ కేంద్రాల ద్వారా అమృత హస్తం, బాలామృతం, బాలసంజీవిని, గిరిగోరు ముద్దలు లాంటి కార్యక్రమాలు అమలవుతున్నాయి. వాటికంటే ధీటుగా గర్భిణీ బాలింతలు వారివారి పోషణ స్థితితో సంబంధం లేకుండా సంపూర్ణ పోషణను తీసుకువచ్చారు. పైగా సరికొత్త మెనూతో ఈ కార్యక్రమం అమలుచేయటం చెప్పుకోదగ్గ అంశం. ఆరేళ్ళలోపు పిల్లల్లో ఎదుగుదల లోపాన్ని అధికమించ టంపై కేంద్రం దృష్టి సారించింది. ప్రస్తుతం 38.4 శాతంగా ఉన్న ఇలాంటి చిన్నారుల సంఖ్యను 25 శాతానికి తగ్గించాలని లక్ష్యంగా పెట్టుకుంది. ఈ లక్ష్యంలో భాగంగా జాతీయ పౌష్టికా హార కార్యక్రమం పోషణఅభియాన్ కోసం రూ.3,700కోట్లు కేటాయించారు.

- ★ మొత్తం మీద మహిళాశిశు అభివృద్ధి శాఖకు రూ. 30,007.10 కోట్లు కేటాయింపులు.
- ★ 'అంగన్‌వాడీ సర్వీసు'లకు రూ.20,532,38 కోట్లు ప్రధాన మంత్రి మాతృవందన యోజనకు రూ.2,500 కోట్లు.
- ★ సమగ్ర శిశు అభివృద్ధి సేవలకు రూ.1,500 కోట్లు 'భేటీ బచావో భేటీ పడావో'కు రూ. 220 కోట్లు.
- ★ 'మహిళా శక్తి కేంద్రాల'కు రూ. 100 కోట్లు.
- ★ 'పనిచేసే మహిళలకు వసతిగృహాల' పథకానికి రూ. 150 కోట్లు.
- ★ 'ఉజ్జ్వల (మహిళల అక్రమ రవాణా నిరోధం, పునరావాస కార్యక్రమం)కు రూ. 220 కోట్లు
- ★ సామాజిక సేవా రంగానికి మొత్తం మీద రూ. 4,036.49 కోట్లు.
- ★ కేవలం మహిళలకు మాత్రమే ప్రత్యేకించిన పథకాలకు రూ.28,600 కోట్లు.
- ★ షెడ్యూల్ కులాలు, ఇతర వెనుకబడిన తరగతుల (ఓబీసీలు) సంక్షేమానికి రూ. 85,000 కోట్లు.
- ★ షెడ్యూల్డ్ తెగలకు రూ. 53,700 కోట్లు.

# పదోన్నతి శుభాకాంక్షలు



మహిళా శిశు సంక్షేమ శాఖలో
వివిధ హోదాల్లో పనిచేసి
**ఎ.పి.డి.గా** పదోన్నతి పొందిన
మా **సి.డి.పి.ఒ.** మేడమ్

## శ్రీమతి మనోరంజని గార్కి

శుభాకాంక్షలు

సిబ్బంది, పర్యవేక్షకులు, అంగన్‌వాడీ కార్యకర్తలు, హెల్పర్లు

**ఐసిడిఎస్ ప్రాజెక్టు, విజయవాడ అర్బన్ -1, కృష్ణా జిల్లా**






# 'అంతర్జాతీయ మహిళా దినోత్సవ శుభాకాంక్షలు





గుడిలేని దైవం అమ్మ...
కల్మషం లేని ప్రేమ అమ్మ...
అమృతం కన్నా తియ్యనైన పలుకు అమ్మ...
నా గుండె పలికే ప్రతి మాట అమ్మ...



**సి.డి.పి.ఒ మరియు సిబ్బంది**

**ఐ.సి.డి.ఎస్. ప్రాజెక్టు,**

**రాజమండ్రి అర్బన్, తూ॥గో॥ జిల్లా**



అంతర్జాతీయ మహిళా దినోత్సవ

శుభాకాంక్షలు

'అంగన్‌వాడీ వాయిస్'కి

4వ వార్షికోత్సవ శుభాకాంక్షలు

సిడిపివో మరియు సిబ్బంది

ప్రగతిపథంలో

ఉయ్యూరు ఐసిడిఎస్ ప్రాజెక్టు

కృష్ణా జిల్లా



స్త్రీలు ఎక్కడ గౌరవించబడతారో
అక్కడ దేవతలు నివాసముంటారు

అంతర్జాతీయ మహిళా దినోత్సవ

శుభాకాంక్షలు

'అంగన్‌వాడీ వాయిస్'

సామాజిక మాసపత్రికకు

4వ వార్షికోత్సవ శుభాకాంక్షలు

సూర్యచంద్రులు జగతికి వెలుగులు...

ఆడపిల్లలు ఇంటికి వెలుగులు...

సిడిపివో మరియు సిబ్బంది

ఐసిడిఎస్ ప్రాజెక్టు, మచిలీపట్నం అర్బన్, కృష్ణా జిల్లా






'అంగన్‌వాడీ వాయిస్'

సామాజిక మాసపత్రికకు

4వ వార్షికోత్సవ శుభాకాంక్షలు

రాష్ట్రవ్యాప్తంగా ప్రతినెల క్రమం తప్పకుండా వెలువడుతున్న
'అంగన్‌వాడీ వాయిస్'కు 5వ వార్షికోత్సవ శుభాకాంక్షలు

స్త్రీ లేకపోతే జననం లేదు...
స్త్రీ లేకపోతే గమనం లేదు...
స్త్రీ లేకపోతే సృష్టిలో జీవం లేదు...
స్త్రీ లేకపోతే అస్సలు సృష్టే లేదు...

సిడిపివో మరియు సిబ్బంది

ఐసిడిఎస్ ప్రాజెక్టు, సి.కె. పల్లి,

అనంతపురం జిల్లా






అంతర్జాతీయ

మహిళా దినోత్సవ శుభాకాంక్షలు

తల్లీ పిల్లల ఆరోగ్యం
దేశానికి సౌభాగ్యం



BREASTFEEDING
A KEY TO SUSTAINABLE DEVELOPMENT

ప్రగతిపథంలో

హిందూపురం ఐసిడిఎస్ ప్రాజెక్టు

అనంతపురం జిల్లా

# నెరవేరిన ఉద్యోగుల అభిలాష

## యూనియన్ చొరవతో సిబ్బంది సమస్యలకు పరిష్కారం

## మంత్రి నిర్ణయానికి రాష్ట్రవ్యాప్తంగా హర్షాతిరేకాలు





రాష్ట్ర మహిళా శిశు సంక్షేమశాఖలో గతంలో ఎన్నడూ లేనివిధంగా ఉద్యోగులు ఎదుర్కొంటున్న సమస్యలపై దృష్టి సారించి వారి వారి ఇబ్బందులను తొలగించాలని జోనల్ స్థాయిలో స్పందన కార్యక్రమాలు ఏర్పాటు చేసి రాష్ట్రవ్యాప్తంగా ఉన్న ఐసిడిఎస్ ఉద్యోగుల అభిమానాన్ని స్వంతం చేసుకున్నారు. రాష్ట్ర మహిళా శిశు సంక్షేమశాఖామాత్యులు తానేటి వనిత మహిళా శిశు సంక్షేమశాఖ చరిత్రలో ఏ మంత్రీ ఇలా చేయ లేదనే ప్రశంసలు వెల్లువెత్తాయి. తమ శాఖ అభివృద్ధికి ఎంత ప్రాధాన్యతనిస్తున్నారో సిబ్బంది సంక్షేమానికి అంతేస్థాయిలో ప్రాధాన్యత కల్పించి వారి వారి సమస్యలకు పరిష్కారం చూపే విధంగా జోనల్ స్థాయిలో గ్రీవెన్స్ ఏర్పాటు చేసి వారి ఇబ్బందులు ఓపిగ్గా విని కొన్నిటికి అక్కడికక్కడే పరిష్కారం చూపగా మరికొన్నిటిని ప్రాధాన్యత క్రమంలో పరిష్కరించటం విశేషమని డిపార్టుమెంటు మొత్తం చర్చించుకుంటున్నారు. గతంలో పాలకులు, అధికారులు తెలిసి తెలియక చేసిన శాఖా పరమైన కొన్ని అంశాలను సరిచేసుకుంటూ తాను ప్రాధాన్యత వహిస్తున్న శాఖను అన్నింటా అగ్రగామిగా నిలపాలని ప్రతి విషయంలోనూ ఆమె పర్యవేక్షణ నుంచి దశల వారిగా సంస్క రణలు తీసుకువస్తున్నారు. దానిలో భాగంగా ఉద్యోగులకు సంబంధించిన ఎన్నో కీలకఅంశాలు వారికి అందాల్సి లబ్ది తెలిసితెలియక చేసిన కొన్ని పొరపాట్లకు ఏళ్ళ తరబడి విచారణలు పెండింగ్‌లో ఉన్న అంశాలు, వారికి రావాల్సిన పదోన్నతులు, సస్పెన్షన్‌కి కాబడిన ఉద్యోగుల వివరాలు బదిలీలకు సంబంధించిన విషయాలు డిప్యుటేషన్ వినతులు ఇలా ప్రతి సమస్యను నేరుగా ఆ శాఖ ఉన్నతాధికారుల నడుమ చెప్పుకుని ఉపశమనం పొందేలా ఏర్పాటు చేసిన గ్రీవెన్స్ ఎంతోమంది ఉద్యోగులకు ఉపయుక్తమైంది. ఫిబ్రవరి 18న జోన్ 2కి సంబంధించిన ఉద్యోగులకు ఏలూరులోను, అదే నెల 25న జోన్ 1కి సంబంధించిన ఉద్యోగులు విశాఖపట్నంలోనూ స్పందన కార్యక్రమం ఏర్పాటు చేసి ఎంతో మందికి ఎన్నో సమస్యలకు పరిష్కారం చూపారు. పశ్చిమగోదావరి జిల్లా ఏలూరులో ఏర్పాటు చేసిన గ్రీవెన్స్‌కి కృష్ణా, తూర్పు, పశ్చిమగోదావరి జిల్లాల ఉద్యోగులు చివరకు అంగన్‌వాడీ కార్యకర్తలు సైతం హాజరై మంత్రివద్ద తమ సమస్యలు ఏకరువుపెట్టుకున్నారు. ముఖ్యంగా నాల్గవతరగతి ఉద్యోగులకు సంబంధించిన పదోన్నతులకు డిగ్రీ అర్హత నిబంధనను తొలగించి అర్హులైన వారికి జూనియర్ అసిస్టెంటుగా, అర్హత ఉన్నవారికి టైపిస్టులుగా పదోన్నతులు కల్పించాలని నిర్ణయించారు. మన శాఖలో రోజువారి భత్యం మీద పనిచేస్తున్న వంటమనుష్యులు, కాపలాదారులకు టైం సేల్ ఇవ్వాలని మంత్రి దృష్టికి తీసుకువచ్చారు. గ్రేడు-1 సూపర్‌వైజర్లకు సిడిపిఒలుగా, గ్రేడు-2 సూపర్‌వైజర్లకు గ్రేడు-1గా పదోన్నతులు కల్పించి కాంట్రాక్టు సూపర్‌వైజర్లను



రెగ్యులర్ చేయాలని యూనియన్ కోరింది. మన శాఖ ద్వారా నడపబడు తున్న ఉద్యోగుల వసతిగృహాలు కాలేజీమేట్ హోమ్ బాలికా సదనాల్లో రెగ్యులర్ సిబ్బంది లేరని వారి స్థానాల్లో ఔట్‌సోర్సింగ్ పద్ధతిలో పోస్టులు భర్తీ చేసి పనిభారాన్ని తగ్గించాలని కోరారు. అలాగే ఖాళీగాఉన్న 100కి పైగా సూపర్‌వైజర్ల పోస్టులను వెంటనే భర్తీ చేయాలన్నారు. కేవలం యూనియన్ కృషితోనే వారి వారి సమస్యలు నేరుగా ఉన్నతాధికారులతో చెప్పి పరిష్కారం లభించేలా చేసారు. మరో రెండు జోన్లలో కూడా ఈ విధమైన గ్రీవెన్స్ ఏర్పాటు చేయాల్సివుంది. ఎన్నో ఏళ్ళు నుండి తమ తమ సమస్యలు పరిష్కారం కాకుండా మానసికంగా కృంగి పోతున్న ఉద్యోగులకు ఈవిధమైన కార్యక్రమం ఏర్పాటు ద్వారా ఉపశమనం పొందామని వారంతా హర్షం వ్యక్తం చేస్తున్నారు.

### మంత్రివర్యులకు అధికారులకు యూనియన్ కృతజ్ఞతలు

దీర్ఘకాలంగా అపరిష్కృతంగా ఉన్న తమ ఉద్యోగుల సమస్యలను సావదానంగా విని పరిష్కారమార్గాలు చూపించిన మంత్రి తానేటి వనితకు విశాఖ ముఖ్య కార్యదర్శి దమయంతి డైరెక్టర్ శుక్లాకి వారి సిబ్బందికి మహిళా శిశు సంక్షేమశాఖ యూనియన్ రాష్ట్ర అధ్యక్షులు సుబ్బరాజు కృతజ్ఞతలు తెలిపారు. అంతేకాక 12 మంది సిడిపిఒలకు ఎపిడిలుగా పదోన్నతులు కల్పించిన సందర్భంగా ప్రత్యేక ధన్యవాదాలు చెప్పారు. అలాగే ఇంకా ఖాళీగా ఉన్న 130 సిడిపిఒ పోస్టులను అర్హులైన మినిస్టీరియల్ సూపరింటెండెంట్లు గ్రేడ్-1 సూపర్‌వైజర్లుతో భర్తీ చేయాలని అలాగే 600 మందికి గ్రేడ్-2 నుంచి గ్రేడ్-1 సూపర్‌వైజర్లుగా పదోన్నతి ఇవ్వాలని కోరారు. 800 మంది అంగన్‌వాడీ కార్యకర్తలకు పరీక్ష నిర్వహించి వారిని గ్రేడ్-2 సూపర్‌వైజర్లుగా పదోన్నతులు ఇవ్వాలని విన్నవించారు.

### సూపర్‌వైజర్స్ అసోసియేషన్ కృతజ్ఞతలు

ఉద్యోగుల సమస్యలు పరిష్కరించేవిధంగా ఒక మంచి వేదిక ఏర్పాటు చేసిన మంత్రి తానేటి వనిత ప్రిన్సిపల్ సెక్రటరీ దమయంతి, డైరెక్టర్ శుక్లా వారి సిబ్బందికి అధ్యక్ష కార్యదర్శులు నిహారిక ప్రభాకరమ్మ, కళావతిలు ప్రత్యేకంగా కృతజ్ఞతలు తెలిపారు. క్షేత్రస్థాయిలో ఎంతో కష్టపడి పనిచేస్తున్న తమ సూపర్ వైజర్ ఇఒల సమస్యలను కూడా సానుకూలంగా విని వాటిపై స్పందించిన తీరు పట్ల తమ యూనియన్ సభ్యులు సైతం ధన్యవాదాలు తెలియచేస్తున్నారన్నారు. మిగతా జోన్లలో కూడా స్పందన కార్యక్రమం ఏర్పాటు చేసి ఆ జిల్లాల సిబ్బంది సమస్యలను పరిష్కరించే విధంగా చొరవ తీసుకోవాలని కోరారు. ముఖ్యంగా అర్హులైన సూపర్‌వైజర్లకు ఎలాంటి నిబంధనలు విధించకుండా వెంటనే పదోన్నతులు ఇవ్వాలని కోరారు.

## ఫ్లాష్! ఫ్లాష్!! ఫ్లాష్!!!

**'అంగన్‌వాడీ వాయిస్'** సామాజిక ప్రజా చైతన్య మాసపత్రిక 4 వసంతాలు పూర్తి చేసుకుని **5వ వసంతంలోకి** అడుగు పెడుతున్న సందర్భంగా వార్షికోత్సవ ప్రత్యేక కానుకగా త్వరలో జరగబోయే సూపర్‌వైజర్ల పరీక్షకు సంబంధించిన **'స్టడీ మెటీరియల్'ని** వచ్చే సంచిక నుండి పాఠకులకు అందించటానికి నిర్ణయించటమైనది. ఏప్రిల్ 2020 సంచిక నుండి క్రమం తప్పకుండా సూపర్‌వైజర్స్ పదోన్నతికోసం పరీక్షకు హాజరయ్యే కార్యకర్తలందరూ సద్వినియోగం చేసుకోండి.

# అంగన్‌వాడీ కేంద్రం ఎలా ఉండాలి?

*(అనంతపురం జిల్లా పిడి చిన్మయదేవి సహకారంతో)*

1. అంగన్‌వాడీ కేంద్రం బోర్డు ఉండాలి.
2. ఫ్లెక్సీలు

   ఎ. ఉద్దేశ్యాలు, బి. సేవలు, సి. గర్భవతులు మరియు బాలింతల మెను, డి. 7-3 సంవత్సరాల పిల్లల మెను, ఇ. 3-6 సంవత్సరాల పిల్లల మెను, ఎఫ్. SAM, MAM పిల్లల మెను (ఎటువంటి అత్యవసర పరిస్థితుల్లో పిల్లల ఆరోగ్య పరిరక్షణ నిమిత్తం పోషకాహార పునరావాస కేంద్రాలలో చేర్పించవలెను), జి. ప్రీ-స్కూల్ టైంటేబుల్, హెచ్. VHSND I&II, ఐ. LMP, EDD, DOM, జె. Milk 'Do's& Don't, కె. హ్యాండ్ వాష్ Practices, ఎల్. Food Pyramid, ఎమ్. SAM, MAMచార్ట్, ఎన్. డిపార్టుమెంటులో జరిపే సెలబ్రేషన్ చార్ట్, ఓ. చైల్డ్ ఫ్రెండ్లీ విలేజ్
3. లబ్ధిదారుల పట్టిక

   ఎ. pregnant women, బి. lactating mothers, సి. 7-3 years, డి. 3-6 years, ఇ. SAM, MAM, ఎఫ్. బాలసంజీవిని
4. Display

   ఎ. ప్రీ-స్కూల్ కిట్ and sylabus books, బి. మెడికల్ కిట్, సి. weighing Mechines, salter, adult weighing, infant meter, stadia meter
5. food (in AWCs) Display

   ఎ. బియ్యం, బి. కందిపప్పు, సి. నూనె, డి. శనగలు, ఇ. పాలు, ఎఫ్. గ్రుడ్లు, జి. బాలామృతం,
6. Register Display

   a. Daily, b. Weekly, c. Forthright, d. Monthly, e/ Quarterly, f. Half Early, g. Annually
7. అవసరమైన వస్తువులు

   a. Mats, b. Dustbin, c. Akshya patra, d. Chappal Stand, e. Bucket, f. Binde, g. Mug, h. Napkin

### 8. Vessels

a. Plates, b. Glasses, c. Vessels

### 9. Stationary

a. Nail cutter, b. Comb, Soap etc.,

### 10. Innovations

a. Uniforms, b. Donations, c. Kitchen gardening, d. Water filter, e. Paintings

### 11. Important Phone No's to display

a. Child help line : 1098, b. Women help line : 181, c. Police help line : 100, d. CMPo's, e. CDPO, f. Tahsildars, g. Supervisor, h. Village Secretary

1. ఆడపిల్లలు పుట్టినప్పటి నుండి మహిళ చనిపోయేంతవరకు కూడా ఎటువంటి ఆపద పరిస్థితులలో ఉన్నప్పటికీ వారిని పరిరక్షించడానికి మహిళా అభివృద్ధి మరియు శిశు సంక్షేమశాఖలో అన్ని రకాలైనటువంటి పునరావాస ప్రక్రియ కలదు కాబట్టి అటువంటి వారు మీ పరిధిలో ఉన్నట్లయితే సహకరించగలరు.
2. పుట్టినప్పటి నుండి 18 సంవత్సరాలలోపు బాలికలకు ఏ రకమైన ఆపద పరిస్థితులలో ఉన్న వారిని పరిరక్షించడం.
3. పునరావాస ప్రక్రియ కలదు కావున సహకరించగలరు
4. అనాథ, తల్లికాని తండ్రి కాని లేని పిల్లలు, ముందు తల్లి దగ్గర వున్నా పిల్లలు, ఒంటరి మహిళలు మరియు వారి పిల్లలు గుర్తించి మన శాఖ ద్వారా వారియొక్క భవితకు తోడ్పడగలరు.

**Supervisors**

1. 1-5వ తేదీలోపల CAS నందు గ్రోత్ అప్‌డేట్ చేసారా లేదా అని మోనిటర్ చేయాలి.
2. 1-10వ తేదీ లోపల FCRలో స్టాక్ authentication చేయాలి. (బియ్యం, కంది బ్యాల్లు, నూనె, శనగలు, బాలామృతం, కోడిగుడ్లు, పాలు)

   16-18వ తేదీ లోపల Regular పాలు, బాలామృతం, కోడిగుడ్లు ఇండెంట్ ఆన్‌లైన్‌లో చేయాలి.
4. బాలసంజీవిని, 28వ తేదీ ప్రాజెక్టు ఆఫీస్‌కు ఇండెంట్ ఇవ్వాలి.
5. ప్రతిరోజు Visits-AP మోనిటరింగ్ టూల్ మరియు LS app లో అప్‌డేట్ చేయాలి.
6. త్రాగునీరు, టాయిలెట్స్, ఎలక్ట్రిసిటీ సదుపాయం ఎప్పటికప్పుడు కేంద్రములలో కల్పించాలి.



7. SAM, MAM పిల్లలు online చేయాలి, Physical గా కూడా taly చేయాలి.

**CDPO**

1. 1వ తేదీ లోపల బాలసంజీవిని ఇండెంట్ P.D. ఆఫీస్‌కు ఇవ్వాలి.
2. 1-5వ తేదీ లోపల CAS నందు, 1-10వ తేదీ లోపల న్యూట్రీ టాస్క్ నందు గ్రోత్ చేసారో లేదో Moniter చేసి, చేయించాలి,
3. 1-5వతేదీ లోపల MPR's PD ఆఫీస్‌కుsubmit చేయాలి.
4. 1-10వ తేదీ లోపల FCR, Authentication supervisors fallowup చేశారో లేదో చేసి చేయించాలి.
5. 16-18వ తారీఖు లోపల బాలామృతం, పాలు, కోడిగుడ్లు ఇండెంట్ ఆన్‌లైన్ చేశారో లేదో చెక్ చేయాలి.
6. 22వ తారీఖు నాడు కోడిగుడ్లు బార్కోడ్ తయారుచేసి Supervisors ద్వార అంగన్‌వాడీ వర్కర్‌కి ఇవ్వాలి.
7. ప్రతి రెండు రోజులకు ఒక్కసారి CAS Dash Board లో లాగిన్ అయ్యి fallowup చేయాలి.
   ముఖ్యంగా ప్రీ-స్కూల్ హాజరుపట్టిక కేంద్రం ఎన్ని రోజులు తెరిచారు. గ్రోత్, హోంవిజిట్స్‌ను fallowup చేయాలి.

**IT రిలేటెడ్**

1. ప్రతినెల అంగన్‌వాడి వర్కర్స్ గ్రోత్ 1 నుండి 5వ తేదీ లోపు ప్రతి నెల అప్‌డేట్ చేయాలి.
2. రోజువారి న్యూట్రీషన్ ప్రతిరోజు ఫొటోలతో సహా అప్‌డేట్ చేయాలి మరియు సింక్ చేయాలి రాత్రి 12 గంటలలోపు సింక్ చేయాలి.

* హోమ్‌విజిట్ అనేవి అంగన్‌వాడీ కేంద్రము నందు కాకుండా ఖచ్చితముగా గర్భిణి, బాలింత, 0-6 సం॥ పిల్లలు ఇంటికి వెళ్ళి చేయాలి.
* T.H.R. ప్రతినెల 1 నుండి 5వ తేదీలోపు అప్‌డేట్ చేయాలి.
* కొత్త గర్భవతి నమోదు చేసేటప్పుడు కచ్చితముగా ఆధార్ కార్డు స్కాన్ చేయాలి.
* ప్రతి నెల CAS మొబైల్ నందు మౌలిక సదుపాయాలు అప్‌డేట్ చేయాలి.
* ప్రతి నెల 1 నుండి 5వ తేదీలోపు 0-6 సం॥ పిల్లల గ్రోత్ అప్‌డేట్ చేయాలి. 10వ తేదీ లోపు క్లోజ్ అవుతుంది.
* ప్రతి రోజు వారి హాజరు అప్‌డేట్ చేసి సంతకం చేయాలి. గర్భవతులను, బాలింతలను ప్రతిరోజు T.H.R. అప్‌డేట్ చేసి సంతకం చేయాలి.
* బాల సంజీవిని లబ్ధిదారులు అప్‌డేట్ చేయాలి.
* Services Willingnes ప్రతినెల ప్రతి లబ్దిదారునికి (గర్భవతులకు, బాలింతలకు, 0-6 సం॥ల పిల్లల) అప్‌డేట్ చేయాలి. అప్‌డేట్ చేస్తేనే ఫుడ్ జనరేట్ అవుతుంది.
* Migration Request మరియు acceptant ఖచ్చితముగా ఫాలోఅప్ చేయాలి.
* Immunization Services ను కూడా ఉన్నవారికి అప్‌డేట్ చేయాలి.
* ఏ డేట్ చేసినా సంతకం కచ్చితముగా చేయాలి.

**Supervisers**

* ప్రతి నెల 1 నుండి 10వ తేదీ లోపు FCR online చేయాలి.
* ప్రతి నెల 1 నుండి 15లోపు Food Authorization చేయాలి
* ప్రతి నెల 10 నుండి 18వ తేదీలోపు Food Indent online చేయాలి (గుడ్లు, పాలు బాలామృతం)
* అన్ని అంగన్‌వాడీ సెంటర్స్‌కి CAS డేటాలో గ్రోత్ 5వ తేదీలోపు కంప్లీట్ అయ్యేటట్లు ఫాలో అప్ చేయాలి.
* సెక్టార్ పరిధిలోని అన్ని అంగన్‌వాడీ కేంద్రములలో న్యూట్రీటాస్క్‌లో గ్రోత్ 10వ తేదీలోపు కంప్లీట్ అయ్యేటట్లు ఫాలో అప్ చేయాలి.
* విసిట్ అప్పుడు గ్రోత్ క్రాస్ చెక్ చేయాలి.

**Food Security**

1. ప్రతి అంగన్‌వాడీ సెంటర్ లోపల ఫుడ్ నిల్వకి గాలి, వెలుతురు మరియు శుభ్రత ఉండేటట్లు చూడాలి.
2. అంగన్‌వాడీ కేంద్రము వెలుపల శుభ్రత పాటించాలి.
3. భౌతిక నిల్వ, పుస్తకము నిల్వలు కచ్చితముగా tally అయి ఉండాలి
4. మెను ప్రకారము ప్రతిరోజు ఫుడ్ వండాలి, మెను చార్ట్ కచ్చితముగా డిస్‌ప్లే చేయాలి.
5. ఫుడ్ రిజిస్టర్, లబ్దిదారుల రిజిస్టర్, రోజువారి హాజరుపట్టిక, ప్రీస్కూల్ హాజరుపట్టిక, స్టాఫ్ హాజరుపట్టిక, ప్రతిరోజు అప్‌డేట్ చేయాలి.
6. లబ్దిదారుల సంఖ్య డిస్‌ప్లే చేయాలి.

**Monitoring Tool**

1. CDPO, Supervisers తమ పరిధిలోని అన్ని అంగన్ వాడీ సెంటర్స్‌లకి తనిఖీ చేసి టూల్ నందు అప్‌డేట్ చేయాలి.



2. గ్రోత్ క్రాస్ చెక్ చేయాలి.
3. ఫుడ్ క్వాలిటీ, క్వాంటిటీ మరియు భౌతిక నిలువ చెక్ చేయాలి.
4. ఫుడ్‌రిజిస్టర్స్(బాలసంజీవిని) ఖచ్చితముగా ధ్రువీకరించాలి.
5. సూపర్‌వైజర్ రిమార్క్స్ ఖచ్చితంగా రిజిస్టర్‌లలో రాసిరావాలి.
6. అంగన్‌వాడీ కేంద్రములలో మౌళిక సదుపాయాలు – త్రాగునీరు, టాయిలెట్లు, కరెంటు, ఫ్యాన్, లైట్, మెడికల్ కిట్, ప్రీ స్కూల్ కిట్ ఖచ్చితముగా ఉండాలి.
7. మెడికల్ కిట్‌లో మెడిసిన్ ఇచ్చేముందు వాటిపై expiry తేది చూసి ఇవ్వాలి.
8. మెడికల్ కిట్‌ను పిల్లలకు అందని ప్రదేశములో పెట్టాలి.

**అంగన్‌వాడీ సహాయకురాలు విధులు మరియు బాధ్యతలు**

* అంగన్‌వాడీ కార్యకర్తలకు సహాయంగా ఉంటూ అంగన్ వాడీ కార్యక్రమాలు అన్ని పూర్తి అయ్యే వరకు ఉండాలి.
* రోజువారి వాడకానికి పరిశుభ్రమైన నీరు ఇవ్వాలి.
* అనుబంధ పోషకాహార కోసం అందిన పదార్థాలని భద్రపరచాలి.
* అంగన్‌వాడీ కార్యకర్త పర్యవేక్షణలో పూర్తి ప్రాథమిక విద్యకు తోడ్పడే పరికరాలని తయారుచేయాలి.
* అంగన్‌వాడీ సకాలములో తెరవటం, కార్యక్రమాల అనంతరం తలుపు తాళాలు వేయటం చేయాలి.
* అంగన్‌వాడీ కార్యకర్తలు లేని సమయములో కేంద్రములో అన్ని బాధ్యతల్ని సహాయకురాలు చూసుకోవాలి.
* అనుబంధ పోషకాహారం వండి పిల్లలకు, స్త్రీలకు అందించాలి.
* అంగన్‌వాడీ కేంద్రమును, పరిసరాలను శుభ్రముగా ఊడ్చి నీళళ్ళు చల్లాలి, చెట్లకు నీళ్ళు పోయాలి.
* అంగన్‌వాడీకి వచ్చే పిల్లలను పరిశుభ్రముగా ఉంచాలి.
* గ్రామం నుండి పిల్లలను అంగన్‌వాడీ కేంద్రమునకు తీసుకుని రావాలి. తిరిగి వారు ఇళ్ళకు క్షేమముగా చేరేలా చూడాలి.
* పిల్లలు పరిశుభ్రతను పాటించడంలోను, మూత్రవిసర్జనది కార్యక్రమాలను వారు అలవాటు చేసుకోవడంలోను వారికి సహాయము చేయాలి.
* ఆరోగ్య తనిఖీలు చేసేటప్పుడు పిల్లల బరువు తీసే సమయములోనే, గర్భిణీ స్త్రీలకు పిల్లలకు వ్యాధి నిరోధక టీకాలు అందించే సమయములోనే అంగన్‌వాడి కార్యకర్తకు సహకరించాలి.
* అనుబంధ పోషకాహారం వండేటప్పుడు పోషక విలువలు నష్టపోకుండా వండటం, పోషకాహారాన్ని శుభ్రంగా, జాగ్రత్తగా భద్రపరచడం చేయాలి.
* చెత్తను దూరముగా పారవేయాలి.
* అంగన్‌వాడీ పరిసర ప్రాంతాలలో కూరగాయ మొక్కలను పెంచాలి.
* పిల్లలు ఆడుకునేటప్పుడు, సృజనాత్మక కార్యక్రమాలు నిర్వహించేటప్పుడు సహకరించాలి.
* ప్రాంతీయ భాషలో పాటలు పాడటం, ఆటలాడటం, కథలు చెప్పటం చేయాలి.

## పూర్వ ప్రాథమిక విద్య – కాలపట్టిక

09.00–9.30 పరిశుభ్రత
09.00–10.00 ప్రార్థన – ప్రాతన, అల్పాహారం
10.00–10.20 మంచి అలవాట్లు/సంభాషణ
10.20–10.50 లోపలఆటలు/బయట ఆటలు/శారీరక వ్యాయామం
10.50–11.00 విరామం
11.00–11.30 సంసిద్ధత
11.30–12.00 కథలు/సృజనాత్మక
12.00–12.15 ఆహార పంపిణీకి సిద్ధపరచడం
12.15–1.00 మధ్యాహ్న భోజనం
1.00–2.30 విశ్రాంతి, నిద్రసమయం
2.30–2.50 అభినయ గీతాలు
2.50–3.10 అల్పాహారం
3.10–3.30 సాంకేతిక పరిజ్ఞానం/సంస్కృతిక కార్యక్రమాలు/ప్రకృతి సందర్శన
3.30–4.00 ఇంటికి పోవుటకు సంసిద్ధత

## అంగన్‌వాడీ వర్కర్లు

1. 1–5 తేదీ లోపల న్యూట్రీ టాస్క్ మరియు CAS లో గ్రోత్ అప్‌డేట్ చేయాలి.
   i. 1వ తేదీన VHND-I జరపాలి
   ii. సర్వీస్ willingess కూడా 1వ తేదీలోనే ok చేయాలి
   iii. Basic information లో ఏదైనా మార్పులు ఉంటే 1వ తేదీలోపే చేయాలి.
   iv. న్యూట్రీ టాస్క్‌లో Immunisation, ANS, PNC, Agrisi due delivaries, child registration చేయాలి.
   v. మౌళిక సదుపాయాలు అప్‌డేట్ చేయాలి.
   vi. హోంవిజిట్ ఎప్పటికప్పుడు చేయాలి.
   vii. THR డిస్ట్రిబ్యూషన్ అప్‌డేట్ చేయాలి.
2. e-pass ద్వార బియ్యం, కందిబ్యాల్లు, నూనె, శెనగలు 5వ తేదీ లోపల తీసుకోవాలి.
   i. కోడిగుడ్లు phase wise Bar Code System ద్వార scan చేసి సింక్ చేయాలి.

ప్రతిరోజు న్యూట్రీ టాస్క్, CAS నందు ప్రీ–స్కూల్ హాజరు, గర్భవతులు, బాలింతల హాజరను అప్‌డేట్ చేయాలి.

# ఈ ఏడాది పదవీ విరమణ పొందుతున్న అధికారులు

| వ. సంఖ్య | పేరు | ఉద్యోగం చేస్తున్న ప్రదేశము | పుట్టిన తేదీ | రిటైర్‌మెంట్ తేదీ |
|---|---|---|---|---|
| 1 | జి విశాలాక్షి | ప్రాజెక్టు డైరెక్టర్, ప్రకాశం | 13-04-1960 | 30-04-2020 |
| 2 | ఎ శేషుకుమారి | ప్రాజెక్టు డైరెక్టర్, నెల్లూరు | 29-05-1960 | 31-05-2020 |
| 3 | జి రాఘవులు | సిడిపివో, రాజవొమ్మంగి | 03-03-1960 | 31-03-2020 |
| 4 | వి. రాజ్యలక్ష్మి | ఎసిడిపివో, బంటుమిల్లి | 12-04-1960 | 30-04-1960 |
| 5 | బి. సుజాత | సిడిపివో, నర్సరావుపేట | 20-04-1960 | 30-04-2020 |
| 6 | బి. విజయశ్రీ | సిడిపివో, కపిలేశ్వరపురం | 09-05-1960 | 31-05-2020 |
| 7 | డి. భారతి | ఎసిడిపివో, రాజాం | 16-05-1960 | 31-05-2020 |
| 8 | వి. అమరావతి | సిడిపివో, గణపవరం | 18-05-1960 | 31-05-2020 |
| 9 | ఎస్. పద్మావతి | సిడిపివో, విశాఖపట్నం | 01-06-1960 | 31-05-2020 |
| 10 | ఎస్. శ్రీమత్తమ్మ | ఎసిడిపివో, రాయచోటి | 01-06-1960 | 31-05-2020 |
| 11 | బి. అనూరాధ | సిడిపివో, కోటబొమ్మాళి | 07-06-1960 | 30-06-2020 |
| 12 | ఎస్. ఎలిజబెత్ | ఎసిడిపివో, తెనాలి | 07-06-2020 | 30-06-2020 |
| 13 | ఎన్. నాగమల్లేశ్వరి | సిడిపివో, కోవూరు | 29-06-1960 | 30-06-2020 |
| 14 | షేక్ రమీజా భాను | సిడిపివో, గిద్దలూరు | 01-07-1960 | 30-06-2020 |
| 15 | పి. సరస్వతి | సిడిపివో, చోడేపల్లి | 01-07-1960 | 30-06-2020 |
| 16 | సిహెచ్. ఆదిలక్ష్మమ్మ | సిడిపివో, పోరుమామిళ్ళ | 01-07-1960 | 30-06-2020 |
| 17 | సిహెచ్. శ్రీనివాసరావు | సెక్షన్ ఆఫీసర్, మంగళగిరి | 14-07-1960 | 31-07-2020 |
| 18 | ఎస్. భవాని | ఎసిడిపివో, ఆళ్ళగడ్డ | 04-07-1960 | 31-07-2020 |
| 19 | టి. లీలావిజయకుమారి | ఎసిడిపివో, చిన్నకొత్తపల్లి | 07-07-1960 | 31-07-2020 |
| 20 | బి. రత్నకుమారి | సిడిపివో, నక్కపల్లి | 12-07-1960 | 31-07-2020 |
| 21 | జి. అరుణదేవి | సిడిపివో, చిత్తూరు | 02-08-1960 | 31-08-2020 |
| 22 | జి. మనోరమ | సిడిపివో, టెక్కలి | 13-08-1960 | 31-08-2020 |
| 23 | ఎన్. హైమావతి | సిడిపివో, రైల్వేకోడూరు | 20-08-1960 | 31-08-2020 |
| 24 | పి. చంద్రకళ | సిడిపివో, ఇచ్ఛాపురం | 26-11-1960 | 30-11-2020 |
| 25 | పి. సరస్వతి | ఎసిడిపివో, పలమనేరు | 27-11-1960 | 30-11-2020 |
| 26 | ఎం. అక్కమాంబ | ఎసిడిపివో, గుడివాడ | 29-12-1960 | 31-12-2020 |

**డి.డి. క్యాడర్‌లో పదవీ విరమణ పొందుతున్న వారి పేర్లు**

| | | | | |
|---|---|---|---|---|
| 1. | డి. సుఖజీవన్‌బాబు | ప్రాజెక్టు డైరెక్టర్, | తూర్పుగోదావరి జిల్లా | మే 31 |
| 2. | ఉమాదేవి | జె.పి.సి. డైరెక్టర్, | గుంటూరు | మార్చి 31 |
| 3. | ఉషాఫణికర్ | ప్రాజెక్టు డైరెక్టర్, | చిత్తూరు | నవంబర్ 30 |

**జె.డి. క్యాడర్‌లో పదవీ విరమణ పొందుతున్న వారి పేర్లు**

| | | | | |
|---|---|---|---|---|
| 1. | వి. శారదా | ఆర్‌జెడి | ఒంగోలు రీజియన్ | ఆగస్టు 31 |
| 2. | శ్రీమతి శివపార్వతి | జె.డి., | డైరెక్టరేట్ | ఆగస్టు 31 |










'అంగన్‌వాడీ వాయిస్'కి
వార్షికోత్సవ శుభాకాంక్షలు

అభివృద్ధిపథంలో పెరవలి ఐసిడిఎస్ ప్రాజెక్టు

STOP
DOMESTIC VIOLENCE





సి.డి.పి.ఒ మరియు సిబ్బంది
పెరవలి ఐసిడిఎస్, ప॥గో॥ జిల్లా





'అంగన్‌వాడీ వాయిస్'కి
4వ వార్షికోత్సవ శుభాకాంక్షలు






స్త్రీ లేకపోతే జననం లేదు
స్త్రీ లేకపోతే గమనం లేదు
స్త్రీ లేకపోతే సృష్టిలో జీవం లేదు
స్త్రీ లేకపోతే అసలు సృష్టే లేదు



సి.డి.పి.ఒ మరియు సిబ్బంది
ఐ.సి.డి.ఎస్. ప్రాజెక్టు, కొవ్వూరు, ప॥గో॥ జిల్లా




# అంతర్జాతీయ మహిళా దినోత్సవ శుభాకాంక్షలు







అధికారులకు, ప్రజాప్రతినిధులకు,
ఐ.సి.డి.ఎస్ సిబ్బందికి
మహిళా దినోత్సవ శుభాకాంక్షలు
మరియు 'అంగన్‌వాడీ వాయిస్'కు
వార్షికోత్సవ శుభాకాంక్షలు

రక్తహీనతను దూరంగా పెడదాం... పండంటి బిడ్డకు జన్మనిద్దాం...

## సి.డి.పి.ఓ మరియు సిబ్బంది



## ఐసిడిఎస్ ప్రాజెక్టు, ఆధోని అర్బన్



కర్నూలు జిల్లా



# 'అంతర్జాతీయ మహిళా దినోత్సవ శుభాకాంక్షలు








'అంగన్‌వాడీ వాయిస్'
సామాజిక ప్రజా చైతన్య మాసపత్రికకు
4వ వార్షికోత్సవ శుభాకాంక్షలు.

## సూర్యచంద్రులు జగతికి వెలుగులు
## ఆడపిల్లలు ఇంటికి వెలుగులు

## సి.డి.పి.ఓ మరియు సిబ్బంది

## ఐ.సి.డి.ఎస్. ప్రాజెక్టు, పాలకొండ, శ్రీకాకుళం జిల్లా

# మేనికి మేలైన లోదుస్తులు

నేటి హైటెక్ యుగంలో కూడా అనేకమంది మహిళలు లోదుస్తులు కొనుగోలు చేయటానికి ఇబ్బందులు పడతారు. పురుషులు సేల్స్‌మేన్‌లుగా ఉండే దుకాణాల్లో అయితే మరీ ఇబ్బంది. బ్రాలను అడిగి, పరిశీలించి కొనుగోలు చేయాలన్నా సిగ్గుపడుతూ చేతికి అందిన దాన్ని తీసుకుని తిరుగుముఖం పడుతున్నారు. తీరా ఇంటికి వచ్చాక వేసి చూసుకుంటే అది వదులుగానో బిగుతుగానో ఉండటాన్ని గ్రహించి దానిని బయట చెప్పుకోలేక అలాగే ధరిస్తున్నారు. బ్రా అంటే కేవలం అందం కోసమేనని అందరూ అనుకుంటారు కానీ అది ఆరోగ్యానికి అనేక రకాలుగా మేలు చేస్తుందన్న విషయాన్ని వారు విస్మరిస్తున్నారు. సరైన సైజు బ్రాలు వాడితే మెడనొప్పి, వెన్నునొప్పి, తలనొప్పి లాంటి వాటికి దూరంగా ఉండవచ్చు. అంతేకాదు బ్రా ఎంపిక లోపాలే రొమ్ము క్యాన్సర్‌కు పలు సందర్భాల్లో కారణ భూతమవుతుందని అంటున్నారు. అలా అని మంచి బ్రాండ్, బ్రా నెంబరు ఇవి మాత్రమే తెలిస్తే లోదుస్తులు ఎంపిక కరెక్టుగా చేసామని కాదు. బ్రాలలో సాధారణ బ్రా స్పాంజ్ బ్రా వంటి అనేక రకాలైన కప్ సైజులతో ఉంటాయి. అందులో నైలాన్, కాటన్ బ్రాలు ముఖ్యమైనవి. మీరు ఎన్నుకునే బ్రా కొంచెం కూడా స్తనభాగం బయటకు రాకుండా ఉండే విధంగా ఉండాలి. కప్ సైజు బ్రాను కొనుగోలు చేయటంలో ఉన్న ఆసక్తిని స్ట్రాప్ ఎంపికలోనూ చూపాలి. వెడల్పు తక్కువగా ఉండే స్ట్రాప్‌లు వక్షోజాలను సరైన రీతిలో ఉంచలేవు. అలాగే ముందువైపు హుక్కు ఉండే బ్రాలు కూడా వాటికి ఇబ్బంది కల్గిస్తాయి. బ్రాలు వాడకపోతే వక్షోజాలు వదులుగా ఉంటాయి పాలు పట్టే పిల్లల తల్లులైతే డబుల్‌కప్ టైప్ బ్రాలు తొడుక్కోవడం ఎంతైనా అవసరం. వ్యాయామం చేసేటప్పుడు కూడా బ్రాను ఖచ్చితంగా తొడుక్కోవాలి. ఎటువంటి కాలంలోనైనా కాటన్ బ్రాలు తొడుక్కోవడం మంచిది. బ్రా సైజు ఎప్పుడూ ఒకేలా ఉంటుందని అనుకుంటే పొరపాటే. మీ బరువులో వచ్చే మార్పును బట్టి బ్రా సైజునూ మార్చాలి. గర్భధారణ సమయాల్లో, ప్రసవం తర్వాత వక్షోజాల పరిమాణంలో మార్పు వస్తుంది. ఈ సైజుకు సరిగ్గా తెలుసుకోవాలంటే టేప్ తీసుకుని వీపు నుంచి వక్షోజాల మీదుగా ముందుకు తీసుకువచ్చి నంబర్‌ను చూసుకోవాలి. ఎల్లప్పుడూ ఐదు రకాల బ్రాలు అందుబాటులో ఉండేటట్లు చూసుకోవాలి. అన్నిరకాల ఆకృతులకు సరిపోయే ఫుల్‌కప్ సైజు బ్రాలు మెడవరకు ఉండే

## బ్రాండ్ చూస్తే చాలదు



జాకెట్టు తొడుక్కునేటప్పుడు దానికి తగిన బ్రా. పాలు ఎక్కువగా పట్టే సమయంలో కూడా తొడుక్కునేందుకు వీలైన బ్రా. నైటీ వంటి దుస్తులు ధరించినప్పుడు అందుకు సరైన విధంగా ఉండే ఈజీ బ్రా, చుడీదార్, మిడ్డి వంటి దుస్తులను ధరించినప్పుడు వాటికి అనువుగా ఉండే బ్రా. ఇటువంటి రకాలైన బ్రాలు ఒకే రంగులో కాకుండా అనేక రంగుల్లో కూడా ఉండటం అవసరం. అలాగే బ్లౌజులో వేసుకునేటప్పుడు కూడా కలర్ కాంబినేషన్ సరిపోయినట్లుగా చూసుకోవాలి. లేకపోతే నలుగురిలో నవ్వుల పాలు అయ్యే అవకాశాలుంటాయి. వరుసగా రెండు రోజులు ఒకే బ్రా వేసుకోవడం వల్ల కండరాలు పట్టేసినట్లుగా నొప్పి వస్తుంది. అలా వేసుకోకూడదు. బ్రాలను ఎప్పుడూ మడత పెట్టకూడదు కాస్త స్థలం ఉంటే చిన్న హ్యాంగర్లకు తగిలించడమే మంచిది. కప్ సైజు మరీ పెద్దగాఉన్న, చిన్నగాఉన్నా ఇబ్బందిగానే ఉంటుంది. అవకాశం ఉంటే ట్రయిల్ రూపంలో ఒకసారి సరిచూసు కొని ఎంపిక చేసుకోవటం మంచిది. ముదురురంగు టాప్ వేసు కున్నప్పుడు నలుపు లేదా ముదురు నీలం రంగు బ్రా వేసుకోవాలి. ముదురు రంగు టాప్ మీద లేత రంగులవి వేసుకుంటే లైటింగ్ బాగా ఉన్నప్పుడు బయటకు కనిపించి ఇబ్బందిగా ఉంటుంది. బ్రా ముందుభాగంలో ఉండే అండర్‌వైర్ ఎప్పుడూ రొమ్ము కింద నుంచి రావాలి. అది మరీ అతుక్కుపోయి ఉంటే కరెక్టు సైజు కాదని అర్థం. బ్రాలను వాషింగ్‌మెషిన్‌లో వేసి ఉతక్కూడదు. ఒకవేళ ఉతికితే హుక్‌పెట్టి వాషర్‌బ్యాగ్‌లో వేసి ఉతకాలి. డ్రయర్‌లో పెట్టకూడదు. ప్రతి ఆరు నెలలకు ఒకసారి బ్రాలను మార్చివేస్తే ఆరోగ్యానికి, చర్మానికి కూడా చాలా మంచిది. లేకపోతే స్కిన్ ఎలర్జీలు వచ్చే అవకాశం ఉంటుంది. కరెక్టు సైజు కాకుండా కాస్త వదులుగా ఉన్నవాటిని ఎంపిక చేసుకోవాలి. అంటే మొదటి హుక్ పెట్టుకుంటే సరిపోయే వాటిని ఎంచుకోవాలి. కొన్ని ఉతుకులు తర్వాత వాటిని టైట్ చేసుకోవచ్చు. బ్రాలు కేవలం బ్రాండ్ చూస్తే చాలదు. వాటి విషయంలో కాస్తంత అవగాహన కల్గి ఉండాల్సిందే.

# వన్‌స్టాప్ సెంటర్‌ని ఆకస్మిక తనిఖీ చేసిన డైరెక్టర్ శుక్లా

పశ్చిమగోదావరి జిల్లా ఏలూరు నగరంలో ఉన్న వన్‌స్టాప్ సెంటర్‌ని మహిళా శిశు సంక్షేమశాఖ డైరెక్టర్ కృతికా శుక్లా మంత్రి వనితతో కలిసి ఇటీవల ఆకస్మిక తనిఖీ చేశారు. స్థానిక ప్రభుత్వ ఆసుపత్రి ప్రాంగణంలో ఉన్న వన్‌స్టాప్ సెంటర్‌ని సందర్శించిన శుక్లా అక్కడ నమోదు అయిన కేసులు, సిబ్బంది వివరాలు ఆ సెంటరులో ఉన్న సౌకర్యాలు చూసి సంతృప్తి వ్యక్తం చేశారు. సమాజంలో మహిళల రక్షణ కోసం దిశ చట్టం ప్రవేశపెట్టడం అభినందనీయమన్నారు. దిశ పోలీసుస్టేషన్‌కి అనుసంధానంగా సఖి వన్‌స్టాప్ సెంటర్ సిబ్బంది పనిచేయా లన్నారు. దశల వారిగా వన్‌స్టాప్ సెంటర్స్‌ని ఇంకా అభివృద్ధి పరుస్తామని ఎక్కడైనా సిబ్బంది కొరత ఉంటే నియామకాలు చేస్తామన్నారు. వన్‌స్టాప్ కేంద్రాలకు వచ్చే ప్రతి వారికి న్యాయం జరగాలి అని ఆ విధంగా సిబ్బంది చిత్తశుద్ధితో పనిచేయాల న్నారు. మంత్రి తానేటి వనిత అక్కడ పనిచేస్తున్న ఉద్యోగుల



వివరాలు అడిగి తెలుసుకున్నారు. ఇప్పటివరకు-అక్కడ నమోదు అయిన కేసుల వివరాలు కోసం రికార్డులను తనిఖీ చేశారు. ముఖ్యమంత్రి వైఎస్ జగన్మోహనరెడ్డి తెచ్చిన దిశ చట్టంతో సమాజంలో మహిళలకు, బాలికలకు ఎంతో మేలు జరుగుతుం దన్నారు. మంత్రితోపాటు జోన్-2 ఆర్‌జెడి టివి శ్రీనివాస్, ప్రాజెక్టు డైరెక్టర్ విజయకుమారి ఉన్నారు. వన్‌స్టాప్ అడ్మిని స్ట్రేటర్ నిర్మల మంత్రి వనితకు డైరెక్టర్‌కు స్వాగతం పలికి అక్కడ పరిస్థితులను వివరించారు.

# మహిళను ఈ ఒక్కరోజే కాదు.. ప్రతిరోజు గౌరవించాలి

మహిళా దినోత్సవంనాడు మాత్రమే కాదు..మహిళను ప్రతి రోజూ ఆ మాటకొస్తే ఆజన్మాంతం గౌరవిస్తూ ఉండాలి. కుటుం బాన్ని త్యాగం చేసి సమాజంలో విశిష్ట సేవలు అందించే స్థాయికి మహిళలు వెళ్తున్నారు. ప్రతిమహిళ సంరక్షణకు ప్రతి ఒక్కరూ పునరంకితం కావాలి. మహిళలను సన్మానించడం తమ అదృష్టమని సూపరింటెండెంట్ ఆఫ్ పోలీసు కెకెఎన్ అన్బురాజన్ అన్నారు. కడప పోలీసు కార్యాలయ ఆవరణలోని పెన్నార్ పోలీసు కాన్ఫరెన్స్ హాలులో అంతర్జాతీయ మహిళా దినోత్సవ కార్యక్రమం నిర్వహించారు. భద్రత భరోసాకు రాష్ట్ర ప్రభుత్వం దిశ చట్టాన్ని తీసుకువచ్చిందన్నారు. ఈ చట్టంపై అందరిలో అవగాహన కల్పించేందుకు పలు కార్యక్రమాలు నిర్వహిస్తున్నామన్నారు. దిశయాప్ డౌన్‌లోడ్ చేసుకుని అత్య వసర సమయంలో పోలీసు సేవలు పొందాలని సూచించారు. ఈ యాప్ ద్వారా సమాచారం రాగానే మూడు నిమిషాల్లో బాధితురాళ్ళు ఉన్న ప్రాంతానికి పోలీసులు చేరుకుంటారన్నారు. ఈవ్‌టీజింగ్, పబ్లిక్ డ్రింకింగ్, గ్యాంబ్లింగ్, క్రికెట్ బెట్టింగ్‌లకు పాల్పడే వ్యక్తుల సమాచారాన్ని కమాండ్ కంట్రోల్‌కు అందిస్తే క్షణాల్లో వారి ఆట కట్టిస్తామన్నారు. రాబోయే సంవత్సరానికి మహిళలకు సంబంధించి అజెండా రూపొందించేందుకు ప్రతి మహిళాదినోత్సవం వేదికగా చేసుకోవాలని సూచించారు. కార్యక్రమంలో విద్యార్థినులు మహిళా దినోత్సవంపై ప్రసంగిం చారు. సమాజంలో విశిష్ట సేవలందించిన చైల్డ్ డెవలప్‌మెంట్ ప్రాజెక్టు ఆఫీసర్ సిహెచ్ ఆదిలక్ష్మమ్మ, సైకో సోషల్ కౌన్సిలర్ పివి సునీత, వన్‌స్టాప్ సెంటర్ న్యాయవాది పి ఉమ, విజేత మహిళా మండలి అధ్యక్షురాలు జి అరుణ, మైదుకూరు మహిళా పీసీ సుధామణి, ఐసిడిఎస్ సూపర్‌వైజర్ ఎం విమలమ్మ, మహిళా హోంగార్డులు తులసి, డి మెర్రిలను మహిళా ఎస్‌ఐలు గాయత్రి, వరలక్ష్మీలను సన్మానించారు.

### దిశ షార్ట్‌ఫిలిం పోస్టరు ఆవిష్కరించిన ఎస్‌పి

యువ దర్శకుడు బాలు రూపొందిస్తున్న దిశ లఘు చిత్రం పోస్టరును ఎస్‌పి పోలీసు కాన్ఫరెన్సుహాలు ఆవరణలో ఆవిష్కరిం చారు. సమాజానికి విలువైన సందేశం ఇచ్చే ఇలాంటి లఘు చిత్రాలు రూపొందించడం అభినందనీయమన్నారు. కార్యక్ర మంలో అదనపు ఎస్‌పి ఎ శ్రీనివాసరెడ్డి, ఎఆర్ అదనపు ఎస్‌పి రుషికేశవరెడ్డి, డిఎస్‌పి రమణయ్య, కడప డిఎస్‌పి సూర్య నారాయణ, ఇన్‌ఛార్జి మహిళా పోలీసుస్టేషన్ డిఎస్‌పి రంగ నాయకులు, సిఐలు, ఎస్‌ఐలు, ఆర్‌ఎస్‌ఐలు, మహిళా పోలీసు సిబ్బంది, కార్యదర్శులు, మహిళామిత్రులు పాల్గొన్నారు.



# దశదిశలా 'దిశ' చట్టం-1



మహిళలకే మహోదయం - ఈ దిశ చట్టంతో ప్రతీ దినం - 2
ఆపద ఉన్న ప్రతి దశలో - ఆదరణ ఉందమ్మా ఈ 'దిశ'లో
జగనన్నా తెచ్చేనీచట్టమూ - జరుగదులే ఇంక ఏ నష్టమూ ॥మహిళలకే॥

చిన్నారి పొన్నారి చిరుదివ్వెలు - చెరిగి పోరాదు ఆ వెలుగులు
తెలుగింటి అమ్మాయి చిరునవ్వులు - ఆగి పోరాదు ఆ జిలుగులు
మహిళా మణుల మాంగల్యము - చేరగనీయద్దు సింధూరము
స్త్రీ జాతితోనే మన మనుగడ - లేకుంటే శాంతి ఇంకెక్కడా ॥మహిళలకే॥

ఏడు రోజుల్లో పరిశోధన - పద్నాలుగు రోజుల్లో విచారణ
శిక్షలు తప్పవు మరి తుదకు - ఎక్కాలి మెట్లు ఉరి వరకూ
లైంగిక దాడికి యత్నించినా - ముగిసిపోతుంది నీ జీవితం
అత్యాచారాలు మానండిరా - అకృత్యాలింక సాగావురా ॥మహిళలకే॥

తల్లిదండ్రులారా మీ కొడుకులకు - నేర్పించండి సన్మార్గము
అవలక్షణాలున్న పిల్లలకు - బోధించండి దిశ పాఠము
నేరము చేసిన తక్షణము - ఇక కుమిలిపోవాలి క్షణ క్షణము
ఛీ కొట్టేస్తుంది సమాజము - ఆలోచించాలి యువ తరమూ ॥మహిళలకే॥

ఆనంద ఆంధ్రప్రదేశ్‌ను - నిర్మిద్దాము మనమందరం
ప్రతి అతివల మోమున సంతోషం - నిలిచినప్పుడే సౌభాగ్యం
అందరూ ఓ తల్లి పిల్లలమై - కలిసుందామూ కలకాలము
ఆ రోజు కొరకే దిశ చట్టము - ఆనందాలింక మన సొంతమూ ॥మహిళలకే॥

**ఎల్లూట్ల ఉదయ్‌కుమార్**
Sr. Asst., Estt C.I. Section,
HOD, WD & CW, Guntur

**'అంగన్‌వాడీ వాయిస్' ఆన్‌లైన్ ఎక్కౌంటు**
**ఆంధ్రాబ్యాంక్ 107111100001273**
**సి.ఆర్.ఆర్. బ్రాంచ్, ఏలూరు, ఐఎఫ్‌ఎస్ కోడ్ ANDB0001071**

# మహిళాభివృద్ధితోనే సమాజ పురోగతి

## మహిళలపై నేరాలు అరికట్టేందుకు దిశ పోలీసుస్టేషన్లు తుది మార్గం

## పోలీస్ స్టేషన్ ప్రారంభోత్సవంలో కృష్ణా జిల్లా కలెక్టర్ ఇంతియాజ్





మహిళాభివృద్ధితోనే సమాజం పురోగతి సాధిస్తుందని అటు వంటి మహిళలకు అన్నివిధాలుగా రక్షణ కల్పించాల్సిన బాధ్యత ప్రతి ఒక్కరిపై ఉందని కృష్ణా జిల్లా కలెక్టరు ఎఎండి ఇంతియాజ్ అన్నారు. స్థానిక పోలీసు కంట్రోల్ రూం వద్ద ఏర్పాటు చేసిన 'దిశ పోలీసుస్టేషన్‌ను కలెక్టరు ప్రారంభించారు. ఈ సందర్భంగా కలెక్టరు ఇంతియాజ్ మాట్లాడుతూ మహిళలపై నేరాలు జరగకుండా అరికట్టేందుకు దిశ పోలీసుస్టేషన్లు తుది మార్గం కావాలన్నారు. మహిళలు ఆర్థిక, సామాజిక, రాజకీయ, తదితర అన్ని రంగాలలోను పురుషులతో సమానమైన ఆధిక్యతను ప్రదర్శిస్తూ ముందుకు దూసుకువెళ్తున్నారన్నారు. అయితే సమాజంలో మహిళలకు మరింత రక్షణ, భద్రత కల్పించేందుకు రాష్ట్ర ప్రభుత్వం దిశచట్టాన్ని తీసుకువస్తున్నదని, దిశ చట్టం పూర్తిగా అమలు అయినప్పుడే మహిళా సాధికారతకు పూర్తి సార్ధకత చేకూరుతుందన్నారు. మహిళ ఆనందంగా, సంతోషంగా ఉండేలా ప్రతి ఒక్కరూ చూడాలని, అప్పుడే సమాజం పురోగతి సాధిస్తుందన్నారు. లేకపోతే ఆ సమాజం అధోగతి పాలవుతుందన్నారు. విజయవాడ పోలీసు కమిషనర్ ద్వారకా తిరుమలరావు మాట్లాడుతూ రాష్ట్ర డిజిపి గౌతం సవాంగ్ 'ఇయర్ ఆఫ్ ఉమెన్ సేఫ్టీ' అన్న పిలుపు మేరకు మహిళలందరికీ భద్రత, భద్రతాభావం కలిగించడానికి కృషి చేస్తామన్నారు. వన్‌స్టాప్ సెంటర్లు, దిశ పోలీసుస్టేషన్లు ఏర్పాట్లు, వాటిలో పూర్తిస్థాయిలో సిబ్బంది నియామకం, తదితర ఏర్పాట్లు పూర్తి చేస్తామన్నారు. దిశ చట్టం కింద ఏదైనా సంఘటన జరిగిన వెంటనే కేసు నమోదు, ఇన్వెస్టిగేషన్, ఛార్జిషీటు నమోదు, డిఎన్ఎ రిపోర్టు, డాక్టర్ల నివేదికలు నిర్దేశిత సమయంలో అందించి, బాధిత మహిళలకు న్యాయం జరగడంలో జాప్యం నివారించేలా వాతావరణాన్ని కల్పించేందుకు కృషి చేస్తామన్నారు. రాష్ట్ర దిశ ప్రత్యేక అధికారి దీపికా పాటిల్ మాట్లాడుతూ నెల రోజుల క్రితం రాష్ట్రంలో మొదటి దిశ పోలీసుస్టేషన్ ప్రారంభించడం జరిగిందని, ఈ నెల రోజుల్లో వాటి సంఖ్య 18కి చేరిందన్నారు. మహిళల భద్రతకు రాష్ట్ర ప్రభుత్వం అత్యంత ప్రాధాన్యత ఇస్తుందనడానికి ఇదే నిదర్శనమన్నారు. దిశ యాప్ ద్వారా ఇంతవరకు 1022 కాల్స్ వచ్చాయని, వీటిలో 39 కేసులకు ఎఫ్ఐఆర్ నమోదు చేయడం జరిగిందన్నారు. రాష్ట్ర దిశ ప్రత్యేక అధికారి కృతికా శుక్లా మాట్లాడుతూ మహిళల పట్ల అసభ్యంగా ప్రవర్తించే పురుషులకు దిశ చట్టం సింహస్వప్నం లాగా ఉండాలన్నారు. రాష్ట్రంలో ఇంత వరకు ఏర్పాటు చేసిన దిశ పోలీసు స్టేషన్లలో కౌన్సిలింగ్, వన్ స్టాప్ సెంటర్లు, మహిళల వసతి షెల్టర్ల వంటి సౌకర్యాలు ఏర్పాటు చేయడం జరిగిందన్నారు. మహిళల భద్రత, సంక్షేమానికి రాష్ట్ర ప్రభుత్వం అనేక కార్యక్రమాలు అమలు చేస్తున్నదని, అమ్మఒడి, సంపూర్ణ పోషణ, కిషోర్ వికాసం, మద్యనిషేదం వంటి కార్యక్రమాలు అమలు చేస్తున్నదన్నారు. మద్యనిషేదం పూర్తిగా అమలు అయిన రోజున మహిళలపై అత్యాచారాలు, గృహహింస వంటి ఎన్నో నేరాలు తగ్గుముఖం పడతాయన్నారు. కార్యక్రమంలో పోలీసు అధికారులు విక్రాంత్ పాటిల్, తదితర పోలీసు అధికారులు పాల్గొన్నారు.

# నిఖిల్ ఎంటర్ ప్రైజెస్ వారి

## సమ్మర్ మెగా డిస్కౌంట్ సేల్

**10% నుండి 50% వరకు**

డౌన్‌పేమెంట్ లేకుండా అతి తక్కువ ఇ.యం.ఐ.తో
వడ్డీలేని వాయిదాలు చెల్లించి గృహోపకరణాలను
మీ సొంతం చేసుకోండి.

**0% ఫైనాన్స్**

ఎక్సేంజ్ ఆఫర్ కలదు






తక్కువ రేటు
నమ్మకమైన సర్వీస్



AMARON LASTS LONG, REALLY LONG. · LG · HAVELLS · IFB Set yourself free · Butterfly Good for a lifetime · F&D a new audio experience



LLOYD · SAMSUNG · BOSCH · MICROTEK TECHNOLOGY WE LIVE · Panasonic · Crompton Greaves

LUMINOUS Inverter · UPS · Battery · VOLTAS · VU CALIFORNIA · V-GUARD · MITSUBISHI ELECTRIC · Aquaguard Clear Pure Sure

# నిఖిల్ ఎంటర్ ప్రైజెస్

లలితా అండ్ కో బిల్డింగ్, ఆర్.ఆర్.పేట, ఏలూరు.
ఫోన్: 08812-234379, 8333829999, 9985521789,








## 'అంగన్‌వాడీ వాయిస్'కి
## 4వ వార్షికోత్సవ శుభాకాంక్షలు

మహిళా శిశు సంక్షేమ శాఖలో ప్రగతిని ఎప్పటికప్పుడు
అందరికీ తెలియపరుస్తూ దినదినాభివృద్ధి చెందుతున్న
"అంగన్‌వాడీ వాయిస్" సామాజిక ప్రజా చైతన్య మాసపత్రికకు
వార్షికోత్సవ శుభాకాంక్షలు...



**తల్లి పిల్లల ఆరోగ్యం... దేశానికి సౌభాగ్యం**

సి.డి.పి.ఒ. మరియు సిబ్బంది
ఐసిడిఎస్ ప్రాజెక్టు, కంబదూరు, అనంతపురం జిల్లా

---



## అంతర్జాతీయ మహిళా దినోత్సవ శుభాకాంక్షలు

మహిళా శిశు సంక్షేమ శాఖలో ప్రగతిని ఎప్పటికప్పుడు
అందరికీ తెలియపరుస్తూ దినదినాభివృద్ధి చెందుతున్న



"అంగన్‌వాడీ వాయిస్"
సామాజిక ప్రజా చైతన్య మాసపత్రికకు
వార్షికోత్సవ శుభాకాంక్షలు...

బాల్య వివాహాలు
బహు అనర్థాలు





సి.డి.పి.ఒ. మరియు సిబ్బంది
ఐసిడిఎస్ ప్రాజెక్టు, కర్నూలు అర్బన్, కర్నూలు జిల్లా

---



## అంతర్జాతీయ మహిళా దినోత్సవ శుభాకాంక్షలతో...

"అంగన్‌వాడీ వాయిస్" సామాజిక ప్రజా చైతన్య మాసపత్రికకు
వార్షికోత్సవ శుభాకాంక్షలు...





నేటి బాలలే రేపటి పౌరులు
బాల్యాన్ని కాపాడదాం వారికి బంగారు భవిష్యత్తునిద్దాం




సి.డి.పి.ఒ. మరియు సిబ్బంది
ఐసిడిఎస్ ప్రాజెక్టు, తాడికొండ, గుంటూరు జిల్లా

# ఉద్యోగులకు అవసరమైన ఉత్తర్వులు

## అవగాహన కోసం

✳ "కారుణ్య నియామకాలు - కొన్ని ముఖ్య ఉత్తర్వులు"

✳ కారుణ్య నియామకాల పునరుద్ధరణ ఉత్తర్వులు
G.O.Ms.No. 687, Dt : 31-10-1977

✳ కుటుంబంలో ఉద్యోగం ఎవరికిఇవ్వాలి వివరణ ఉత్తర్వులు
Govt. Memo.No. 1407333, Dt : 14-11-2003

✳ ఉగ్రవాదుల ఘాతుకాలు, అసాంఘిక శక్తుల దుశ్చర్యల వల్ల చనిపోయిన ఉద్యోగిపై ఆధారపడిన కుటుంబ సభ్యుల కారుణ్య నియామక ఉత్తర్వులు
G.O.Ms. No. 443, Dt : 28-10-2002

✳ ఉద్యోగంలో ఉంటూ ఆత్మహత్య చేసుకున్న వ్యక్తిపై ఆధార పడిన కుటుంబ సభ్యుల కారుణ్య నియామక ఉత్తర్వులు.
Gov. Cir. Memo. No. 41758, Dt : 19-07-2007

✳ 7 సం॥ మించి ఆచూకి తెలియకుండా అదృశ్యమైన ఉద్యోగి కుటుంబ సభ్యులకు కారుణ్య నియామక ఉత్తర్వులు.
Govt. Cir. Memo.No. 60681, Dt : 12-08-2003

✳ కారుణ్య నియామకాలకు కనిష్ఠ, గరిష్ట వయస్సు ఉత్తర్వులు.
G.O.Ms. No. 759, Dt : 06-10-2007

✳ భార్య/భర్త కారుణ్య నియామక సందర్భంలో గరిష్ట వయస్సు ఉత్తర్వులు. G.O.Ms. No. 144, Dt : 15-06-2004

✳ దత్తత తీసుకున్న పిల్లలకు కారుణ్య నియామక ఉత్తర్వులు.
G.O.Ms. No. 612, Dt : 30-10-1991

✳ అవివాహిత ఉద్యోగి చనిపోతే తమ్ముడు, చెల్లెలుకి కారుణ్య నియామక ఉత్తర్వులు.
Para 2(i) of G.O.Ms. No. 612, Dt : 30-10-1991

✳ గుర్తింపు పొందిన ఎయిడెడ్ సంస్థలకు కారుణ్య నియామక పథకం వర్తిస్తుంది.
G.O.Ms. No. 113, Dt : 06-10-2009

✳ శాఖాధిపతి కార్యాలయంలో జూనియర్ అసిస్టెంట్ ఉద్యోగానికి కనీస విద్యార్హతగా పట్టభద్రులై ఉండాలి. సబార్డినేట్ కార్యాలయాలలో కనీస విద్యార్హత ఇంటర్మీ డియట్‌గా నిర్ణయించారు.
G.O.Ms. No. 612, Dt : 30-10-1991

✳ కారుణ్య నియామకాల పద్ధతిలో రికార్డు అసిస్టెంట్ పోస్టు భర్తీ చేయకూడదు.
Govt. Memo.Nop. 536/ser A/96, GAD, Dt : 09-10-1996

✳ ఉద్యోగం నుంచి పదవీ విరమణ చేసిన పెన్షనరు చని పోయిన అతనిపై ఆధారపడిన కుటుంబ సభ్యులకు కారుణ్య నియమక పథకం వర్తించదు.
Govt.Memo.No.618/ser.A/78-11, GAD, Dt : 17-12-1979

✳ కారుణ్య నియామకాల క్రింద విధవరాళ్ళను వారు ఎక్కడైతే క్షేమంగా ఉండగలరో అక్కడ నియమించాలి. స్వంత జిల్లాలు, చనిపోయిన ఉద్యోగి పనిచేసిన స్థలము, ఏ జిల్లాలో అయినా ప్రెసిడెన్షియల్ ఆర్డరుకు లోబడి ఆమె కోరిన జిల్లాకు పోస్టింగు ఇవ్వవచ్చు.
Govt.Memo.No.28967/SG/2004-1, GAD, Dt : 22-06-2004

✳ కారుణ్య నియామకాలను నేరుగా నియమించే పద్ధతిగా (Direct Recruitment) పరిగణించరాదు.
G.O.Ms.No. 151, GAD, Dt : 22-06-2004

✳ కారుణ్య నియామకం క్రింద మరణించిన ఉద్యోగి కుటుంబ సభ్యులలో ఒకరికి ఉద్యోగం కల్పించు సందర్భంలో జిల్లాలో ఏ ప్రభుత్వ కార్యాలయంలోనూ ఖాళీ పోస్టులు లేనప్పుడు, ఆర్థిక సం॥లో 5 పోస్టుల వరకు సృష్టించుటకు జిల్లా కలె క్టర్‌కు అధికారం ఉన్నది. అంతకు మించి పెంచవలెనంటే ప్రభుత్వ అనుమతి పొందవలసి ఉంటుంది.
G.O.Ms. No. 427, GAD Dt : 01-07-1991

✳ కారుణ్య నియామకాలు పారితోషికం చెల్లింపు (EXGRATIA)
ఉద్యోగంలో ఉంటూ మరణించిన ఉద్యోగి కుటుంబ సభ్యు లలో సంపాదనపరులు ఎవ్వరూ లేనప్పుడు, కారుణ్య నియా మకాలకు అర్హతగల వ్యక్తులు లేనపుడు, ఎటువంటి విద్యార్హతలు లేకుంటే, భార్య/భర్త కారుణ్య నియామక అవకాశాన్ని వినియోగించుకోనప్పుడు, కొన్ని షరతులకు లోబడి అట్టి కుటుంబానికి పారితోషికం చెల్లించే అవకాశం ప్రభుత్వం కల్పించింది. నష్టపరిహారం కార్యాలయపు

డ్రాయింగ్ ఆఫీసరు డ్రా చేసి చెల్లించవచ్చును.

(G.O.Ms.No. 166, GAD Dt : 31-03-2005)

* నాల్గవ తరగతి ఉద్యోగులకు రూ. 40,000
* నాన్ గజిటెడ్ అధికారులకు రూ. 60,000
* గజిటెడ్ అధికారులకు రూ. 80,000
* కారుణ్య నియామకాలు-వాగ్దానపత్రము
* కారుణ్య నియామకాల ప్రథమ ఉద్దేశం, సర్వీసులో వుంటూ చనిపోయిన ఉద్యోగిపై ఆధారపడి జీవిస్తున్న కుటుంబ సభ్యులకు బ్రతుకుతెరువు కల్పించటం. అందువల్ల ఈ పథకం ద్వారా కారుణ్య నియామకం పొందిన వ్యక్తి, కుటుంబ సభ్యుల పోషణ భారం వహించాలి. కావున ఆ వ్యక్తికి కారుణ్య నియామకాల ద్వారా ఉద్యోగం కల్పించే ముందు అతను/ఆమె నుండి వాగ్దానపత్రము పొందవలసియున్నది.
* అదేవిధంగా అనారోగ్య కారణాల దృష్ట్యా ఉద్యోగం చేయుటకు అనర్హులుగా నిర్ధారించిన ఉద్యోగిపై ఆధారపడి జీవిస్తున్న, కుటుంబ సభ్యులలో ఒకరికి ఉద్యోగం కల్పించిన సందర్భాలలో కూడా, కుటుంబ సభ్యులను పోషిస్తానని, నిర్లక్ష్యం చేయనని వాగ్దానపత్రం తీసుకోవాలి. కుటుంబ సభ్యులను పోషించకపోయినా, నిర్లక్ష్యం చేసినా అతనిని ఉద్యోగం నుంచి తొలగించవచ్చును.
* అలాంటి సందర్భాలలో ఆ ఉద్యోగిని సర్వీసు నుంచి తొలగించే ముందు, అతనిని సర్వీసు నుండి ఎందుకు తొలగించకూడదో అను విషయమై కారణాలు తెలుపమని నోటీసు జారీ చేయాల్సి ఉంది. ఈ విషయమై CCA రూల్స్ 1991 తెలిపిన ప్రక్రియను అనుసరించాల్సిన అవసరం లేదు.
* అలాంటి సందర్భాలలో ఉద్యోగిని తొలగించు అధికారం సెక్రటేరియట్ శాఖలలో పనిచేయు ఉద్యోగులైతే సంబంధిత శాఖ కార్యదర్శి, ఇతరుల విషయంలో శాఖాధిపతిని కలిగియున్నారు.

Govt. Cir. Memo. No. 58226-A/2002-2 GAD dt: 01-05-2001

* సస్పెన్షన్లు-ప్రవర్తనా నియమావళి CCA రూల్స్ పార్ట్-III
* FR-55 ప్రకారం సస్పెండు అయిన ఉద్యోగికి సస్పెన్షన్ కాలములో ఎలాంటి సెలవులు మంజూరు చేయకూడదు.
* సస్పెన్షన్‌లో ఉన్న ఉద్యోగి తీవ్రమైన ఆరోపణలు ఎదుర్కొంటున్నట్లయితే అతనికి పదోన్నతి కల్పించుటకు అవకాశము లేదని ప్రభుత్వం G.O.Ms. No. 257 తేది 10-06-1999 ద్వారా తెలియజేసింది.
* ప్రభుత్వ ఉద్యోగికి సస్పెన్షన్ కాలములో పదవీ విరమణ వయస్సు వచ్చినయెడల అతనిపై ఉన్న క్రమశిక్షణా చర్యలు పెండింగ్‌లో ఉన్న యెడల అట్టివానికి భంగం కలగకుండా ఆ ఉద్యోగిని పదవీ విరమణ గావించవలెను.

(G.O.Ms.No. 64 F&P Date : 01-03-1979)
(Section 3 of A.P. Public Employment of Age of Super annuation Act 1984)

* సస్పెన్షన్‌లో ఉంటూ చనిపోయిన ఉద్యోగిపై క్రమశిక్షణా చర్యలు పూర్తిగాకాకుండా అసంపూర్తిగా ఉన్న సమయంలో సస్పెన్షన్‌లో ఉన్న ఉద్యోగి చనిపోయిన యెడల సస్పెన్షన్ కాలాన్ని డ్యూటీ క్రింద పరిగణించవలెనని ప్రభుత్వం G.O.Ms. No. 275 F&P తేది 08-08-1997 ద్వారా ఉత్తర్వులు జారీ చేసింది.
* ఆంధ్రప్రదేశ్ స్టేట్ అండ్ సబార్డినేట్ సర్వీస్ రూల్స్ 1996 లోని రూలు 30 ప్రకారం సస్పెన్షన్ ఉన్న ఉద్యోగి క్రమ శిక్షణా చర్యల గురించి విచారణ పూర్తికాకముందే ఏ కారణము చేతనైన తన పదవికి రాజీనామా చేసినయెడల అట్టి రాజీనామా అంగీకరించకూడదు.
* రెండు సం॥ కంటే ఎక్కువ కాలం సస్పెన్షన్‌లో ఉన్న ఉద్యోగి యొక్క క్రమశిక్షణా చర్యలు పెండింగ్‌లో పెడుతూ వెంటనే సర్వీసులోకి పునరుద్ధరించవలెను కొన్ని ప్రత్యేక పరిస్థితులలో మాత్రమే సస్పెన్షన్ కొనసాగించవచ్చు.

(G.O.Ms. No. 526 GAD Dt : 19-08-2008)

* సస్పెన్షన్ కాలంలో ఉద్యోగి జీవనాధారంగా ఉన్న ఉద్యోగం ద్వారా జీతభత్యాలు పొందు అర్హత ఉండదు కాబట్టి, అట్టి ఉద్యోగికి జీవనాధారంగా భత్యములు చెల్లించు అవకాశం FR-53లోని నియమ నిబంధనలకు లోబడి చెల్లించే విధానాలు ప్రభుత్వం కల్పించింది.
* సస్పెండ్ అయిన ఉద్యోగిని తిరిగి సర్వీసులో పునరుద్ధరించే (Resistance) సందర్భంలో జారీచేయవలసిన ఉత్తర సర్వీసులో ప్రభుత్వం G.O.Ms. No. 82 GAD, Dt : 01-03-1996 ద్వారా నిర్దేశించింది.
* సస్పెండ్ అయిన ఉద్యోగి తాను సస్పెండ్ అయిన తర్వాత ఏవిధమైన ఉద్యోగం గాని/వృత్తిగాని/వ్యాపారం గాని యితరత్రా వ్యాపకం గాని చేయటం లేదని ధృవీకరణ పత్రము అధికారికి అందజేయవలెను.
* జీవనాధార భత్యము సస్పెండ్ అయిన ఉద్యోగికి తిరస్కరించరాదు. జీవనాధార భత్యము (Subsistance Allowance) చెల్లింపులు తిరస్కరించటం శిక్షించదగ్గ నేరము.

(Govt. Meme No. 29730/A/458/A2/FR-II/96/ F&P, Dt : 14-10-1996)

* సస్పెన్షన్ కాలాన్ని డ్యూటీలో లేని కాలం (Non Duty) గా పరిగణించినప్పుడు ఉద్యోగ అభ్యర్థనమేరకు సెలవుగా మార్పు (Convert) చేసినపుడు అతని సెలవు జీతములో నుంచి అతనికి ఇదివరకే చెల్లించియున్న జీవనభృతిలో మొత్తం రికవరీ చేయాలి.
* ఉద్యోగిని చిన్న కారణాల వల్ల న్యాయ సమ్మతము గాని సస్పెండ్ చేసే బదులు అతనిని బదిలీచేయవచ్చు. అట్టి బదలీ కాబడిన ఉద్యోగి బదిలీ కాబడిన కొత్త స్థానంలో చేరకుండా సెలవు పెట్టినయెడల అట్టి సెలవు మంజూరు చేయకూడదు. (Govt. Circular Memo No. 595SP/ B/2000 Dt : 21-09-2000&Govt Memo. No. 1733/Ser, C. GAD 03-08-1967)
* ఉద్యోగులను సర్వసాధారణమైన సామాన్య కారణాలపై అనవసరంగా సస్పెండు చేయకూడదు ఆ విధంగా సస్పెండు కాబడిన ఉద్యోగికి జీవనాధార భృతి చెల్లించుటమే కాకుండా అతని సేవలు కూడా ప్రభుత్వం పోగొట్టుకుంటుంది. అందువలన అనవసర కారణాల వల్ల ఉద్యోగిని సస్పెండు చేయకూడదు అని ప్రభుత్వం ఉత్తర్వులు జారీ చేసింది.

(Govt. Memo No. 2213/Ser.C/66-1 GAD Dt : 30-11-1966&Memo No. 4993/Police-C/69-1 Dt : 08-12-1969)

## IMP GO's FROM 1975

1. G.O.Ms. No. 186, Dt : 23-7-1975 - Half Pay Leaves
2. G.O.Ms. No. 295, Dt 130801985 - Mis Carriage Leaves - 42 Days
3. G.O.Ms. No. 374, Dt 16-3-1996 - Extra 5 days Leave for women
4. G.O.Ms. No. 214, Dt 3-9-1996 - Extra Ordinary Leave
5. Proc. No. 132/E1-1/2008 Dt 7-5-2002 Preservation of EL's
6. G.O.Ms. No. 231, Dt 16-9-2005 - Paternity Leave - 15 Days
7. G.O.Ms. No. 180, Dt 29-6-2006 - Increment
8. G.O.Ms. No. 180, Dt 28-3-2011 - Medical reimbursement - Extended up to June - 2017, under Control of DEO Rs. 50,000/- and above to DSE Hyd.
9. G.O.Ms. No. 52, Dt 1-4-2011 - Histerectomy Leave
10. G.O.Ms.No. 447, Dt 28-11-2013 - GPF Part Final withdrawl - Non refundable fund
11. G.O.Ms. No. 23, Dt 13-8-2014 - TG Increment
12. G.O.Ms. No. 39, Dt 15-4-2015 - 50% Amount - GPF Loan&Advance
13. G.O.Ms.No. 49, Dt 27-4-2015 - TSGLI - Slab Rates
14. G.O.Ms.No. 103, Dt 24-7-2015 - PHC Allowance Rs. 2000/-
15. G.O.Ms. No. 27, Dt 24-9-2015 - Education Concession fee reembursement for 2 Children, each one Rs. 2,500/-
16. G.O.Ms.No. 83, Dt 5-12-2015 - Flag fund - Non Gazetted Rs. 100/- Gazetted Rs. 200/-
17. G.O.Ms. No. 4, Dt 19-3-2016, Reader Allowance - SGT - Rs. 1200/pm SA-Rs. 1500/ pm Jr. Lecturers & above Rs. 2000/pm
18. G.O.Ms. No. 122, Dt 11-4-2016 - Obsequies Charges-for deceased employees Rs.20,000/-
19. G.O.Ms. No. 152, Dt 4-5-2016 - Maternity Leave 180 Days
20. G.O.Ms.No. 107, Dt 23-7-2016 - Egges for a week (3 Eggs)
21. G.O.Ms. No. 134, Dt 1-10-2016 - MDM - Ps Level Rs 6.13 Up/Hs Level Rs. 8.18 including 3 egges.

(మిగతా వచ్చే సంచికలో)

# యుడిసి పద్మావతికి సత్కారం

ఆకాశంలో సగంగా ఉన్న మహిళలు సగర్వంగా తలెత్తి ఆశాభావంతో తమ భవిష్యత్తు మరింత దేదీప్యమవ్వాలని పశ్చిమగోదావరి జిల్లా విభిన్న ప్రతిభావంతుల శాఖ అసిస్టెంట్ డైరెక్టర్ ప్రసాదరావు అన్నారు. అంతర్జాతీయ మహిళా దినోత్సవం సందర్భంగా పశ్చిమగోదావరి జిల్లా ఏలూరు గిరిజన భవన్‌లో జరిగిన ప్రత్యేక కార్యక్రమంలో జోన్-2 ప్రాంతీయ సంచాలకుల కార్యాలయంలో యుడిసిగా పనిచేస్తున్న పద్మావతిని ఘనంగా సత్కరించారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ మహిళలు అన్నింటా ముందుండి తమ జీవితాలను అందంగా మలుచుకుంటున్నారని భవిష్యత్తులో మరిన్ని పదోన్నతులు పొంది ఉన్నతశిఖరాలకు చేరాలని ఆయన ఆకాంక్షించారు. పద్మావతి గతంలో కృష్ణా జిల్లాలో పనిచేశారు. తాజాగా ఏలూరు జోన్-2 ప్రాంతీయ కార్యాలయంలో సీనియర్ అసిస్టెంట్‌గా పనిచేస్తు న్నారు. పద్మావతిని సత్కరించడంపట్ల ఏపి ఎన్‌జివో జిల్లా నాయ కులు



హరినాధ్, విభిన్న ప్రతిభావంతుల యూనియన్ జిల్లా అధ్యక్షులు, ఇతర సభ్యులు శుభాకాంక్షలు తెలియజేశారు. ఈమె సత్కారం అందుకోవడం పట్ల ఆమె కార్యాలయం సిబ్బంది, ప్రాజెక్టు డైరెక్టర్ కార్యాలయం ఉద్యోగులు అభినందనలు తెలిపారు.


అంతర్జాతీయ మహిళా దినోత్సవ శుభాకాంక్షలు
'అంగన్‌వాడీ వాయిస్' సామాజిక ప్రజాచైతన్య మాసపత్రికకు
వార్షికోత్సవ శుభాకాంక్షలు...



గర్భిణీ మరియు పుట్టబోయే
శిశువు అవసరాలను తీర్చడానికి
గర్భావస్థ దశలో పౌష్టికాహారం
చాలా ముఖ్యం

సిడిపివో మరియు సిబ్బంది
ఐసిడిఎస్ ప్రాజెక్టు
పిఠాపురం, తూ॥గో॥ జిల్లా

అంతర్జాతీయ మహిళా దినోత్సవ శుభాకాంక్షలు
'అంగన్‌వాడీ వాయిస్' సామాజిక ప్రజాచైతన్య మాసపత్రికకు
వార్షికోత్సవ శుభాకాంక్షలు...



బిడ్డకు సంపూర్ణ అనుబంధ
పోషకాహారంతో పాటు
తల్లిపాలు కొనసాగించటం
అనేది చాలా ముఖ్యం...

సిడిపివో మరియు సిబ్బంది
ఐసిడిఎస్ ప్రాజెక్టు
పెద్దాపురం, తూ॥గో॥ జిల్లా





## 'అంగన్‌వాడీ వాయిస్'కి వార్షికోత్సవ శుభాకాంక్షలు




## అంతర్జాతీయ మహిళా దినోత్సవ శుభాకాంక్షలు

తల్లిదండ్రులను ప్రోత్సహిద్దాం...

తల్లిపాల సంస్కృతిని కొనసాగిద్దాం... నేటికి మరియు ఎన్నిటికి




**సి.డి.పి.ఓ మరియు సిబ్బంది**

**ఐసిడిఎస్ ప్రాజెక్టు, ఉలవపాడు, ప్రకాశం జిల్లా**





## 'అంతర్జాతీయ మహిళా దినోత్సవ శుభాకాంక్షలు




అధికారులకు, అనధికారులకు, ప్రజాప్రతినిధులకు, సహచర సిబ్బందికి,
అంగన్‌వాడీలకు అంతర్జాతీయ మహిళా దినోత్సవ శుభాకాంక్షలు
మరియు "అంగన్‌వాడీ వాయిస్" సామాజిక ప్రజా చైతన్య మాసపత్రికకు
4వ వార్షికోత్సవ శుభాకాంక్షలు...

బాల్య వివాహాలు బహు అనర్థాలు... బాలల హక్కులు కాపాడదాం...
వారి బంగారు భవిష్యత్తుకు బాటలు వేద్దాం




**సి.డి.పి.ఓ మరియు సిబ్బంది**

**ఐసిడిఎస్ ప్రాజెక్టు, ఆళ్ళగడ్డ, కర్నూలు జిల్లా**






## 'అంతర్జాతీయ మహిళా దినోత్సవ శుభాకాంక్షలు



"అంగన్‌వాడీ వాయిస్" సామాజిక ప్రజా చైతన్య మాసపత్రికకు
4వ వార్షికోత్సవ శుభాకాంక్షలు...

చేయి చేయి కలుపుదాం... పోషకాహార విలువలకు పాటుపడదాం...
రక్తహీనతను దూరంగా పెడదాం... పండంటి బిడ్డకు జన్మనిద్దాం...




**సి.డి.పి.ఓ మరియు సిబ్బంది**

**మంగళగిరి ఐసిడిఎస్ ప్రాజెక్టు, గుంటూరు జిల్లా**





## 'అంగన్‌వాడీ వాయిస్'కి వార్షికోత్సవ శుభాకాంక్షలు




నిజాలను నిర్భయంగా ప్రచురిస్తూ
నెలనెల క్రమం తప్పకుండా వెలువడుతున్న
"అంగన్‌వాడీ వాయిస్" సామాజిక ప్రజాచైతన్య మాస పత్రికకు
వార్షికోత్సవ శుభాకాంక్షలు




## సి.డి.పి.ఓ మరియు సిబ్బంది
## ఐసిడిఎస్ ప్రాజెక్టు, నూజివీడు, కృష్ణా జిల్లా

---

## 'అంగన్‌వాడీ వాయిస్'కి 4వ వార్షికోత్సవ శుభాకాంక్షలు




**పోషణ్ అభియాన్**
**ఇంటింటి పోషణ సంబరాలు**

పోషణ అభియాన్‌లో భాగస్వాములవుదాం
శక్తివంతమైన భావితరాలను నిర్మిద్దాం

మహిళాభివృద్ధి మరియు శిశు సంక్షేమ శాఖ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం

ఇంటింటి పోషణ సంబరాలు
నా కుటుంబ పోషణ
నా బాధ్యత
8-22 మార్చి, 2020



## సి.డి.పి.ఓ మరియు సిబ్బంది
## ఐసిడిఎస్ ప్రాజెక్టు, ఆకివీడు, ప॥గో॥ జిల్లా

---






## 'అంగన్‌వాడీ వాయిస్'కి 4వ వార్షికోత్సవ శుభాకాంక్షలు



నిజాలను నిర్భయంగా రాస్తూ ఎప్పటికప్పుడు
మహిళా శిశు సంక్షేమ ప్రగతిని పది మందికి తెలియపరుస్తున్న
"అంగన్‌వాడీ వాయిస్" సామాజిక ప్రజా చైతన్య మాసపత్రికకు
4వ వార్షికోత్సవ శుభాకాంక్షలు...

బాల్య వివాహాలు బహు అనర్థాలు
బాల్య వివాహాలు అరికడదాం
సమాజాన్ని కాపాడదాం



## సి.డి.పి.ఓ మరియు సిబ్బంది
## ఐసిడిఎస్ ప్రాజెక్టు, భీమడోలు, ప॥గో॥ జిల్లా



# వృద్ధులు కాదు... మన బతుకు నిర్దేశకులు



వృద్ధులు... సంపూర్ణ జీవితానికి నిలువెత్తు నిదర్శనాలు.. కుటుంబ వ్యవస్థకు ఆయువుపట్టు..నేటితరానికి మార్గదర్శకులు.. కానీ నేటి ఆధునిక సమాజంలో వాళ్ళ చిరునామాలు అనాథాశ్రమాలు, వృద్ధాశ్రమాలు, మరీ కిందిస్థాయి వాళ్ళయితే ఫుట్‌పాత్‌లే.

## నాగరిక సమాజంలో అనాగరికం

నాగరికమని చెప్పుకుంటున్న ఈ రోజుల్లో మన పెద్దల (వృద్ధులు) పట్ల అనాగరిక చర్యలకు నిలువెత్తు నిదర్శనాలుగా నిలుస్తున్నాయి పరిస్థితులు. అందరూ కాకున్నా...ఎక్కువమంది వృద్ధులు ఒంటరి జీవితాలు అనుభవిస్తున్నారు. తమ ఇళ్లల్లోనే పరాయి వాళ్లలాగా బతుకులు వెళ్లదీస్తున్నారు. కొడుకులు, కోడండ్లు, కూతుళ్ళు, అల్లుళ్ళు ఎవరైతేనేమి...మనుమలు, మనుమరాళ్ల ముందు ఛీత్కారాలకు గురవుతున్నారు. నూటికి తొంభైమంది పరిస్థితి ఇదే అంటే కాదనే వాళ్లెవరూ ఉండరు. ఎందుకంటే ఇది సత్యం. మన కళ్ళ ముందు కనిపిస్తున్న వాస్తవం.

ఈ రోజుల్లో వృద్ధులకు ఎవ్వరూ అంత ప్రాధాన్యం ఇవ్వట్లేదు. కోడలైనా, అల్లుడైనా, సొంత కూతురైనా, కొడుకైనా...తాము ఓ స్థాయికి ఎదిగాక ఎక్కివచ్చిన నిచ్చెనను కాలితో తోసేస్తున్నారు. వృద్ధాప్యంలో కన్నబిడ్డలే తమ పాలిట శత్రువులుగా మారుతున్నారు. దూషణలకు పాల్పడటమే కాకుండా కొందరు శారీరక హింసకూ పాల్పడుతుండటం పతనమవుతున్న మానవతా విలువలకు నిదర్శనం. డబ్బు సంపాదనపై పడి కడుపున పుట్టిన బిడ్డలనే కేర్ సెంటర్లలో చేర్చే ఈ రోజుల్లో వృద్ధులైన తల్లిదండ్రులను సైతం ఓల్డేజ్ హోముల్లో చేర్చేస్తున్నారు. ఆప్యాయతగా మాట్లాడేవారు లేకుండా పోవడంతో వృద్ధుల పరిస్థితి అగమ్యగోచరంగా తయారవుతోంది. దినసరి కూలీలు, వ్యవసాయ కూలీలు, చేతి వృత్తులవారు 60 సంవత్సరాల తర్వాత శరీర సత్తువ తగ్గి సంపాదించలేకపోతున్నారు. వీళ్లకు మరేవిధమైన ఆర్థిక వనరులు లేకపోవడం వలన ఆకలితో అలమటిస్తున్నారు. ఎంతో కష్టపడి కాయకష్టం చేసి రెక్కలు ముక్కలు చేసుకొని పైసాపైసా కూడబెట్టి తమలాగా పిల్లలు కష్టపడకూడదని ముందుచూపుతో పిల్లలకు చదువు చెప్పించి ప్రయోజకుల్ని చేస్తే చివరకు తమ వృద్ధాప్యంలో వాళ్లచేతే బయటికి నిరాదరణకు గురవుతున్నారు. ఉద్యోగ రీత్యా మరో ప్రాంతంలో, ఇతర దేశాలలో స్థిరపడి తమ తల్లిదండ్రులను ఆదుకోని వారు ఎంతోమంది ఉన్నారు. వాళ్ళకు సంపాదించుకోవడం, భార్యాపిల్లలను పోషించుకోవడంలో ఉన్న శ్రద్ధ తల్లిదండ్రులపై ఉండటంలేదు. సాధారణంగా 60 ఏళ్ళ పైబడిన వాళ్లకు రోగాలు మొదలవుతుంటాయి. దీర్ఘకాల రోగాల బారినపడి ఖరీదైన వైద్యం చేయించుకోలేక ఎంతోమంది శేష జీవితాన్ని దుర్భరంగా గడుపుతున్నారు.

ఈ విషయంలో పల్లె పట్నం తేడా లేదు, ధనిక, బీద భేదం లేదు. అందరివీ ఇవే బాధలు. కన్నీటి కథలు! నైతిక విలువలు కనుమరుగయ్యాయి. మానవ సంబంధాలు అవసరానికి మాత్రమే పరిమితమవుతున్నాయి. కడదాకా తోడుండి కాటికి పంపాల్సిన సంతానం కనుమరుగవుతున్నారు. వృద్ధుల కోసం ఓ దినోత్సవాన్ని నిర్వహించడమంటేనే... మనం ఎంతటి పాతాళానికి దిగజారిపోయామో అర్థం చేసుకోవచ్చు. పెద్దల పట్ల నేటితరం వ్యవహారశైలి ఏంటో మననం చేసుకోవచ్చు. మన మూలాలను మనం ఎంతగా పరిగణనలోకి తీసుకుంటున్నామో లెక్కేసుకోవచ్చు. అంతర్జాతీయ స్థాయిలో ఈ సమస్యను చర్చించి మరీ... ఓ దినోత్సవాన్ని జరుపుకోవాల్సిన చర్చించి మరీ...ఓ దినోత్సవాన్ని జరుపుకోవాల్సిన ఆవశ్యకత గుర్తించారు.

1984లో వియన్నాలో మొట్టమొదటిసారిగా వృద్ధుల గురించి అంతర్జాతీయ సదస్సు జరిగింది. అక్కడే సీనియర్ సిటిజన్ అనే పదం పుట్టింది. ఈ సదస్సు జరిగిన తర్వాత ఎటువంటి అభివృద్ధి జరగలేదు. 1990 డిసెంబర్ 14న ఐక్య రాజ్య సమితి చొరవతో వృద్ధుల కోసం ఒక ప్రణాళికను రూపొందించి ప్రపంచ దేశాలన్నీ తప్పనిసరిగా అమలు చేయాలని కోరింది. 2004లో స్పెయిన్ దేశంలో జరిగిన 86 దేశాల సమీక్షా సమావేశాలలో వృద్ధుల సంక్షేమం కోసం 46 తీర్మానాలను ఆమోదించారు. మొదటిసారిగా 1 అక్టోబర్ 1991న ప్రపంచ వ్యాప్తంగా అంతర్జాతీయ వయో వృద్ధుల దినోత్సవాన్ని నిర్వహించారు.



## ఆనాటి అనుభవం

చిన్నప్పుడు ఆరుబయట పడుకొని చుక్కలు చూస్తూ తాతయ్య, బామ్మ, మామ్మలు చెప్పే కథలు వినేవాళ్ళు. ఇప్పుడు అసలు తాతయ్య, బామ్మ అనే వాళ్ళే పిల్లలకు కనిపించడంలేదు. ఆ బంధాలు కూడా పిల్లలకు దూరమవుతున్నాయి. వరుసలు, బంధుత్వాలు కూడా తెలియకుండా పోతున్నాయి. కానీ, గత చరిత్రను, మన పూర్వీకుల అనుభవాలు నెమరువేసుకోవడం వల్ల విజ్ఞానం పెరుగుతుంది. వాళ్లతో చర్చించడం వల్ల సంస్కారం అలవడుతుంది. మన సంస్కృతి ఏంటో ద్యోతకమవుతుంది.

## ఇతర రాష్ట్రాల్లో చర్యలు

ఒడిశాలో అరవై యేళ్ళు దాటిన వృద్ధుల కోసం అంగన్‌వాడీ కేంద్రాలున్నాయి. రోజూ ఉదయాన్నే వృద్ధులు అక్కడికి చేరుకుంటారు. పప్పు భోజనం చేసి తిరిగెళ్తారు. వయోవృద్ధుల ఆకలి బాధ తీర్చడానికి ఒక్కో వృద్ధుడికి 200 గ్రాముల అన్నం, 50 గ్రాముల పప్పు నిత్యం అందజేస్తున్నారు. హర్యానా, తమిళనాడు రాష్ట్రాల్లో 60 ఏళ్లు దాటిన మహిళలకు రోడ్డు రవాణా సంస్థ బస్సుల్లో 50 శాతం రాయితీ ఇస్తున్నారు. ప్రతి డివిజన్‌లో ఆశ్రమం, సీనియర్ సిటిజన్ క్లబ్బుల ఏర్పాటు, ఉచిత వైద్యసేవలు అందుతున్నాయి. కొన్ని రాష్ట్రాల్లో వృద్ధుల సంక్షేమం కోసం ప్రత్యేక శాఖలు పనిచేస్తున్నాయి. మన రాష్ట్రంలో స్త్రీ శిశు సంక్షేమ శాఖలో ఇదో భాగంగా ఉంది. 2003లో రాష్ట్ర ప్రభుత్వాలు విడుదల చేసిన కార్యాచరణ పథకం బస్సుల్లో సీనియర్ సిటిజన్లకు ఛార్జీలు రాయితీ ఇస్తామని ప్రకటించింది. మహారాష్ట్రలో 75 శాతం, రాజస్థాన్‌లో 25 శాతం, పంజాబ్, ఢిల్లీ, చండీగఢ్, గోవాలలో 50 శాతం, కర్నాటకలో 25 శాతం, తమిళనాడు, కేరళలో 30 శాతం రాయితీలు ఇస్తున్నారు. మనదేశంలో 60 ఏళ్లకు మించిన వృద్ధులు దాదాపు 11 కోట్ల మంది ఉన్నట్లు 2011 జనాభా లెక్కలు చెబుతున్నాయి. మరో 20 ఏళ్లలో ఈ సంఖ్య రెట్టింపు కాగలదని అంచనా. అనగా మనిషి జీవన పరిమాణం పెరుగుతుంది. ఇది మంచి పరిణామమే. నీ...దేశంలో నెలకొన్న పరిస్థితులవల్ల సామాన్యులకు నానాటికీ బతుకుభారమవుతోంది. అదేక్రమంలో వృద్ధులపట్ల నిరాదరణ కూడా అంతకంతకు ఎక్కువైపోతోంది. దేశాన్ని పాలిస్తోంది ప్రధానంగా వృద్ధనేతలే అయినప్పటికీ వయోవృద్ధుల సమస్యలకు పరిష్కారం కనబడకపోవడం అసలైన విషాదం.

## వయోజనులకు అండ

వృద్ధుల శ్రేయస్సు దిశగా అనేక దేశాలు చట్టాలు చేసిన యాభై ఏళ్ల తరువాతగానీ భారతదేశం మేలుకోలేదు. ఎట్టకేలకు 2007లో 'తల్లిదండ్రులు-పెద్దలపోషణ, సంక్షేమ చట్టం' అమలులోకి వచ్చింది. అయినా, చట్ట నిబంధనలు కాగితాలకే పరిమితం కావడంతో వృద్ధుల సమస్యలు తీరనేలేదు. అనేక రాష్ట్రాల్లో కనీస మాత్రంగానైనా చట్టం అమలవుతున్న దాఖలాలు కనబడటం లేదు. తల్లిదండ్రుల్ని పట్టించుకోనివారికి మూడు నెలల వరకు జైలు, అయిదు వేల రూపాయల జరిమానా లేదా రెండూ విధించే అధికారాన్ని ట్రిబ్యునళ్లకు ఈ చట్టం కల్పించింది.

భరణాన్ని ఎగ్గొట్టినవారికి నెల రోజుల వరకు జైలుశిక్ష పడుతుంది. వృద్ధులకు అండగా నిలిచే ఇలాంటి నిబంధనలు ఎన్నో చట్టంలో ఉన్నాయి. చట్టప్రకారం వృద్ధులు తమ సమస్యలను నేరుగా ఆర్‌డివో స్థాయి అధికారులకు ఫిర్యాదు చేసుకోవచ్చు. కానీ, సరైన అవగాహన లేకపోవడంతో అధికశాతం వృద్ధులైన తల్లిదండ్రులు నేరుగా పోలీసులు, న్యాయస్థానాలను ఆశ్రయిస్తున్నారు. వృద్ధులకు రైలు ప్రయాణంలో రాయితీ సౌలభ్యం ఉన్నా, అందుకు అనుగుణంగా సీట్లు ఉండవు. ఒంటరిగా జీవించే వృద్ధులకు ఇళ్లవద్ద భద్రత కొరవడుతోంది. ప్రభుత్వ కార్యాల యాలకు వెళ్ళినా, వారికి ప్రాధాన్యం దక్కడం లేదు. బ్యాంకులు, పింఛన్ల కార్యాలయాల వద్ద నిత్యం చాంతాడంత వరసల్లో ఈసురోమంటూ నిలబడక తప్పడం లేదు.

మెయింటెనెన్స్ అండ్ వెల్ఫేర్ ఆఫ్ పేరెంట్స్ ఎండ్ సీనియర్ సిటిజెన్ యాక్ట్-2007 చట్టం, నేషనల్ పాలసీ ఫర్ ఓల్డర్ పర్సన్స్-1999, నేషనల్ ఓల్డ్ ఏజ్ పెన్షన్ స్కీము-1994, అంత్యోదయ పథకం, బీమా కంపెనీల నుంచి వివిధ సీనియర్ సిటిజన్ పథకాలు, నేషనల్ కౌన్సిల్ ఫర్ ఓల్డర్ పర్సన్స్, ఇంటిగ్రేటెడ్ ప్రోగ్రాం ఫర్ ఓల్డర్ పర్సన్స్, రైల్వే, రవాణా, విమానయానాలలో వృద్ధులకు చేయూతనిస్తున్నాయి. సీదా ఒప్పందం, డిక్లరేషన్ ఆన్ సోషల్ ప్రోగ్రెస్ అండ్ డెవలప్‌మెంట్-1969 (సెక్షన్-11) మొదలైనవి వీరి హక్కులుకు బాసటగా నిలుస్తున్నాయి. పాశ్చాత్య దేశాలు వృద్ధుల సంరక్షణకు పలు చట్టాలు రూపొం దించాయి. బతికినంతకాలం వృద్ధులను కుటుంబ సభ్యుల ఆదరణతో చూసుకునే విధంగా పటిష్ట నిబంధనలు చట్టంలో పొందుపరచారు. ఆర్థిక భద్రత సైతం వారికి లభిస్తుంది. ఎవరూ లేనివారికోసం ప్రత్యేక సంరక్షణ కేంద్రాలనూ అనేక దేశాలు ఏర్పాటు చేశాయి. మరీ ముఖ్యంగా వృద్ధుల్లో వయసురీత్యా వచ్చే ఆత్మన్యూనత భావనలను పోగొట్టడానికి కౌన్సెలింగ్ కేంద్రాలూ సేవలందజేస్తున్నాయి. వృద్ధుల భద్రతకోసం కొన్ని దేశాల్లో ప్రత్యేక పోలీసు సేవలు కూడా అందుబాటులో ఉన్నాయి.

## ఈ చర్యలు కూడా తీసుకోవాలి

ప్రత్యేకంగా వృద్ధులకోసమే పలు చర్యలు, జాగ్రత్తలు



తీసుకోవాల్సిన అవసరం, ఆవశ్యకత ఉన్నాయి. ఆర్‌టిసి బస్సులలో రాయితీ, రైల్వేలలో ఇస్తున్న 40శాతం రాయితీకి తోడు ఇంకో 20 శాతం పెంచాలి. అంతే కాకుండా రిజర్వేషన్‌లో కూడా ప్రాముఖ్యం కల్పించాలి. ప్రతి బ్యాంకులో క్యూతో నిమిత్తం లేకుండా సీనియర్ సిటిజన్లకు లావాదేవీలు జరిపించే సదుపాయం కల్పించాలి. కార్పొరేట్ ఆసుపత్రులలో 25 శాతం రాయితీ కల్పించి ఆ విషయాన్ని ఆసుపత్రి బోర్డులపై ప్రచురించాలి. రాష్ట్ర ప్రభుత్వంలోని సీనియర్ సిటిజన్లకు ప్రత్యేక శాఖను ఏర్పాటు చేసి ఒక మంత్రిని నియమించాలి. సీనియర్ సిటిజన్లు ఎదుర్కొంటున్న సామాజిక బాధలు ఎదుర్కొంటున్న సామాజిక బాధలు పరిష్కరించడానికి ప్రత్యేక న్యాయస్థానాన్ని ఏర్పాటు చేయాలి. అనారోగ్యంతో బాధపడే వృద్ధులకు రూ. 2225/-ల పెన్షన్ మంజూరు చేస్తున్నారు. ఇది శుభవార్తే. తిరుపతి, శ్రీశైలం, యాదగిరిగుట్ట మొదలకు రద్దీ ఉండే పుణ్య క్షేత్రాలలో వృద్ధులకు క్యూ నిమిత్తం లేకుండా నేరుగా దర్శన ఏర్పాట్లు కల్పించాలి. వృద్ధులు కూడా అవస్థలు పడకుండా అలమటించిపోకుండా చూసే బాధ్యత యువతకు, ప్రభుత్వానికి ఉంది.

**మన కర్తవ్యం**

మనం ఎదుర్కోబోయే కష్టాలను ముంతే ఎదుర్కొని గుణపాఠాలు నేర్చుకొని మనం ఆ కష్టాలు ఎదుర్కోకుండా మనకొక మంచి మార్గం చూపిన వాళ్ళు...మనం నడపబోయే దారిలో ముందే నడిచి ఎక్కడ ముళ్ళున్నాయో, ఎక్కడ మంచిమార్గం ఉందో ముందే తెలుసుకుని మనకు తెలియచేసిన వాళ్లు. ఇప్పటి సమాజాన్ని మనకంటే ముందు స్వప్నించిన వాళ్ళు. దీని నిర్మాణానికి మనకంటే ముందు రాళ్లెత్తిన వాళ్లు. చరిత్రకు ప్రత్యక్ష సాక్షులు వాళ్ళు. వాళ్ళు...మనవాళ్ళు. మన పెద్దలు, వయోవృద్ధులు, ప్రతి అంశంలోనూ వాళ్లకు ఒక అనుభవం ఉంటుంది. గతాన్ని భవిష్యత్తుతో ముడివేస్తూ వర్తమానంతో జరిపే సంభాషణ వాళ్ల జీవితసారం. అంతెందుకూ... నేడు మనం మన పిల్లలను పసితనంలో ఎంతగా సాకుతున్నామో...అంతే ప్రేమగా మన పసితనంలో వాళ్ళు మనలను సాకారు. వాళ్లు అలా సాకితేనే ఈరోజు మనం మన పిల్లలను సాకగలుగుతున్నాము. ఒకప్పుడు వాళ్ళూ పసిపిల్లలే. వారి తాతలు, తల్లిదండ్రుల చేతులలో ఎంతో ప్రేమగా పెరిగినవారే నన్నది మరచి పోవద్దు.

అందుకే మన పెద్దలను కేవలం వయోవృద్ధులుగా చూడొద్దు. అనుభవంలో వృద్ధులుగా చూడండి. ఇంట్లో పరిస్థితులన్నీ వారితో చర్చించండి. వాళ్లూ మనలో ఒకరిగా గుర్తించి ప్రతి విషయాన్ని వారితో పంచుకోండి. మన పిల్లల ముందు కించపరచకుండా వాళ్ల ప్రాధాన్యాన్ని పిల్లలు తెలుసుకునేలా చేయండి. లేకుంటే రేపు..మన పిల్లలు కూడా..మనల్ని ఘోరాతి ఘోరంగా చూడాల్సి రావొచ్చు. జీవిత చరమాంకంలో కుటుంబంలోని వృద్ధులు ప్రశాంతంగా కాలం గడపటానికి అవసరమైన చేయూత అందజేయడం కుటుంబసభ్యులందరి కనీస బాధ్యత. వృద్ధాప్యంలో ఉన్న వారితో ప్రతిరోజూ కాసేపైనా గడపాలి. వారి అభిప్రాయాలను గౌరవించి కుటుంబంలో ఓ గుర్తింపు ఉన్నదన్న విశ్వాసాన్ని వారిలో కలిగించాలి. కుటుంబమే బాల్యానికి నాంది. సమాజ నిర్మాణానికి అదే పునాది.

వృద్ధులకు అండగా ఉందాం.. వాళ్లతో ఆలోచనలు పంచుకుందాం.. ఎందుకంటే మనం కూడా ఎప్పుడో ఒకప్పుడు వృద్ధులవక తప్పదు కదా..ఈరోజు మనం వృద్ధులకు ప్రేమను పంచితే రేపు మన వృద్ధాప్యంలో మనం కూడా ప్రేమను పొందగలుగుతాం.







అధికారులకు, అనధికారులకు,
ప్రజాప్రతినిధులకు, అంగన్‌వాడీ సిబ్బందికి

అంతర్జాతీయ మహిళా దినోత్సవ శుభాకాంక్షలు

గర్భిణీకి ఐదు నూర్లు - తల్లీ బిడ్డకు నిండు నూరేళ్ళు



సిడిపివో మరియు సిబ్బంది

ఐసిడిఎస్ ప్రాజెక్టు, రణస్థలం, శ్రీకాకుళం జిల్లా

# మహిళా శక్తి మాటల్లో చెప్పలేనిది

## ఆళ్ళగడ్డలో వేడుకగా మహిళా దినోత్సవం




ఇది మహిళా యుగం...అన్ని అంశాల్లోనూ ఆమె నైపుణ్యానికి, ప్రతిభకు గుర్తింపు వస్తున్న తరుణం అయినా ఎన్నో అడ్డంకులు ఆమెను వెన్నాడుతూనే ఉన్నాయని మహిళల స్థితిగతులు బాగుపడనిదే సమాజం అభివృద్ధి చెందదని ప్రముఖ న్యాయవాది రమాదేవి అన్నారు. అంతర్జాతీయ మహిళా దినోత్సవం సందర్భంగా కర్నూలుజిల్లా ఆళ్ళగడ్డ ఐసిడిఎస్ ప్రాజెక్టు పరిధిలో ప్రత్యేక కార్యక్రమం నిర్వహించారు. తొలుత పట్టణంలో సిడిపిఒ రేణుకా జ్యోత్స్న ఆధ్వర్యంలో మండల విద్యాశాఖ అధికారిణి శోభ వివేకవతి, హెల్త్ ఆఫీసర్ డాక్టర్ సుజాత పట్టణంలోని ప్రముఖ న్యాయవాది రమాదేవిలతో కలసి తమ సిబ్బందితో ర్యాలీ నిర్వహించారు. పాతబస్‌స్టాండ్ కూడలి వరకు సాగిన ఈ ర్యాలీ ఐసిడిఎస్ కార్యాలయం చేరుకుంది. అక్కడ ర్యాలీని ఉద్దేశించి రమాదేవి మాట్లాడుతూ చట్టం అమలులో ఎదురవుతున్న సమస్యలు చట్టాల్లోని లొసుగులు నేరస్తుల పాలిట చుట్టాలుగా మారుతున్నాయని చెప్పారు. మహిళలు తమ మనోభావాలను స్వేచ్ఛగా వెల్లడించే పరిస్థితులు నేటి కుటుంబాల్లో కానరావటం లేదన్నారు. సమాజ నిర్మాణంలో సగభాగమైన స్త్రీకి సమానత్వమే మన ప్రగతికి మూలం అన్నారు. ఇదే నినాదంతో ఐక్యరాజ్యసమితి ఏటా మార్చి 8న మహిళా దినోత్సవము నిర్వహిస్తుందన్నారు. సమాజంలో మహిళలు ఆత్మగౌరవంతో, తమ స్వశక్తితో వారివారి ఆర్థిక అవసరాలను వారికి వారే తీర్చుకోగలిగే ఉన్నతస్థితికి చేరుకోవాలని ఆకాంక్షించారు. నేటి మహిళల్లో అడుగడుగున ఎదురవుతున్న వివక్షను ఎదిరించే చైతన్యం పెరగాలన్నారు. నేటి ఆధునిక ప్రపంచంలో మహిళలు అన్ని రంగాల్లో రాణిస్తున్నారని, మానవవనరుల సంపూర్ణ వినియోగంలో మహిళలపాత్ర కీలకం అన్నారు. అయితే సమాజంలో ఎన్ని మార్పులు వచ్చినా, మహిళలు రక్షణ కోసం ఎన్నిచట్టాలు చేసినా అవి కాగితాలకే పరిమితం కాకుండా సక్రమంగా, కఠినంగా అమలు చేయాల్సిన బాధ్యత పాలకులకుందన్నారు. అనంతరం క్రీడల పోటీల్లో గెలుపొందిన విజేతలకు అనగా అంగన్‌వాడీ కార్యకర్తలకు సిడిపిఒ జ్యోత్స్న బహుమతులు అందజేశారు. కార్యక్రమంలో సిడిపిఒ భవాని, సూపర్‌వైజర్లు సుశీల, పద్మావతి తగిరమ్మ, కళావతితోపాటు సచివాలయ సిబ్బంది, మహిళా రక్షణ సిబ్బంది, వాలంటరీలు, గ్రామ సెక్రటరీలు, ఇతర ప్రభుత్వశాఖల అధికారులు అధికసంఖ్యలో పాల్గొన్నారు.




అంతర్జాతీయ మహిళా దినోత్సవ శుభాకాంక్షలు

'అంగన్‌వాడీ వాయిస్' సామాజిక ప్రజా చైతన్య మాసపత్రికకు వార్షికోత్సవ శుభాకాంక్షలు





బాలికల అక్రమ రవాణాను అరికడదాం...

బాల్యాన్ని కాపాడదాం

సిడిపివో మరియు సిబ్బంది

కణేకల్లు ఐసిడిఎస్ ప్రాజెక్టు, అనంతపురం జిల్లా











## 'అంగన్‌వాడీ వాయిస్' కు వార్షికోత్సవ శుభాకాంక్షలు

'అంగన్‌వాడీ వాయిస్' సామాజిక ప్రజా చైతన్య మాసపత్రిక
4 వసంతాలు పూర్తి చేసుకుని 5వ వసంతంలోకి అడుగిడుతున్న
సందర్భంగా శుభాకాంక్షలు...

చేయి-చేయి కలుపుదాం... పోషకాహార నివారణకు పాటుపడదాం

**సి.డి.పి.ఒ మరియు సిబ్బంది**

**ఐసిడిఎస్ ప్రాజెక్టు, రాయదుర్గం, అనంతపురం జిల్లా**








## 'అంగన్‌వాడీ వాయిస్' కు వార్షికోత్సవ శుభాకాంక్షలు

స్వరం మీది పోరాటం మాది
అనే నినాదంతో ప్రతినెలా క్రమం తప్పకుండా
వెలువడుతున్న "అంగన్‌వాడీ వాయిస్"
సామాజిక ప్రజా చైతన్య మాసపత్రికకు 4వ వార్షికోత్సవ శుభాకాంక్షలు...

అంతర్జాతీయ మహిళా దినోత్సవ శుభాకాంక్షలు

**సి.డి.పి.ఒ. మరియు సిబ్బంది**

**ఐసిడిఎస్ ప్రాజెక్టు, ఏలూరు అర్బన్, ప॥గో॥జిల్లా**




# అభివృద్ధిపథంలో మడకశిర ఐసిడిఎస్ ప్రాజెక్టు







## రక్తహీనతను దూరంగా పెడదాం...
## పండంటి బిడ్డకు జన్మనిద్దాం...

అధికారులకు, ప్రజాప్రతినిధులకు,
ఐ.సి.డి.ఎస్ సిబ్బందికి

**మహిళా దినోత్సవ శుభాకాంక్షలు**

మరియు 'అంగన్‌వాడీ వాయిస్'కు వార్షికోత్సవ శుభాకాంక్షలు



## సి.డి.పి.ఓ మరియు సిబ్బంది



**ఐసిడిఎస్ ప్రాజెక్టు, మడకశిర, అనంతపురం జిల్లా**



# 'అంతర్జాతీయ మహిళా దినోత్సవ శుభాకాంక్షలు








గుడిలేని దైవం అమ్మ...
కల్మషం లేని ప్రేమ అమ్మ...
అమృతం కన్నా తియ్యనైన పలుకు అమ్మ...
నా గుండె పలికే ప్రతి మాట అమ్మ...

## సి.డి.పి.ఓ మరియు సిబ్బంది

**ఐ.సి.డి.ఎస్. ప్రాజెక్టు,**
**పెనుకొండ, అనంతపురం జిల్లా**

అంతర్జాతీయ మహిళా దినోత్సవ
శుభాకాంక్షలు





'అంగన్‌వాడీ వాయిస్'కి
4వ వార్షికోత్సవ శుభాకాంక్షలు

**బాలామృతం బాలలకు వరం**

సిడిపివో మరియు సిబ్బంది
ప్రగతిపథంలో
గన్నవరం ఐసిడిఎస్ ప్రాజెక్టు
కృష్ణా జిల్లా

అధికారులకు, అనధికారులకు, ప్రజాప్రతినిధులకు,
సహచర ఉద్యోగులకు, సంక్షేమ శాఖ, సిబ్బందికి
అంతర్జాతీయ
మహిళా దినోత్సవ శుభాకాంక్షలు



వై.ఎస్.ఆర్ కిశోరి వికాసం బాలికలకు వరం
కిశోరి బాలల సాధికారత దిశగా ముందడుగు

'అంగన్‌వాడీ వాయిస్'సామాజిక మాసపత్రికకు
4వ వార్షికోత్సవ శుభాకాంక్షలు
సిడిపివో మరియు సిబ్బంది
ఐసిడిఎస్ ప్రాజెక్టు, శంకవరం
తూర్పుగోదావరి జిల్లా





అంతర్జాతీయ
మహిళా దినోత్సవ శుభాకాంక్షలు

స్త్రీ లేకపోతే జననం లేదు...
స్త్రీ లేకపోతే గమనం లేదు...
స్త్రీ లేకపోతే సృష్టిలో జీవం లేదు...
స్త్రీ లేకపోతే అస్సలు సృష్టే లేదు...



సిడిపివో మరియు సిబ్బంది
ఐసిడిఎస్ ప్రాజెక్టు, కైకలూరు
కృష్ణా జిల్లా



'అంగన్‌వాడీ వాయిస్'
సామాజిక మాసపత్రికకు
4వ వార్షికోత్సవ శుభాకాంక్షలు



అంతర్జాతీయ
మహిళా దినోత్సవ శుభాకాంక్షలు




గర్భిణీకి ఆరు నూర్లు...
తల్లీ బిడ్డకు నిండు నూరేళ్ళు

సిడిపిఓ మరియు సిబ్బంది
ఐసిడిఎస్ ప్రాజెక్టు ధోన్
కర్నూలు జిల్లా

అధికారులకు, అనధికారులకు, ప్రజాప్రతినిధులకు, సహచర ఉద్యోగులకు, సంక్షేమ శాఖ, సిబ్బందికి

అంతర్జాతీయ మహిళా దినోత్సవ శుభాకాంక్షలు



**తల్లి బిడ్డల ఆరోగ్యం దేశానికి సౌభాగ్యం**

'అంగన్‌వాడీ వాయిస్' సామాజిక మాసపత్రికకు 4వ వార్షికోత్సవ శుభాకాంక్షలు

**సిడిపివో మరియు సిబ్బంది**

**ఐసిడిఎస్ ప్రాజెక్టు, కపిలేశ్వరపురం**

**తూర్పుగోదావరి జిల్లా**

---



అంతర్జాతీయ మహిళా దినోత్సవ శుభాకాంక్షలు






15-44 సంవత్సరాల మధ్య వయస్సు ఉన్న ప్రతి స్త్రీ ధనుర్వాతం రాకుండా వ్యాధి నిరోధక టీకాలు తప్పనిసరిగా వేయించాలి

**సిడిపివో మరియు సిబ్బంది**

**ఐసిడిఎస్ ప్రాజెక్టు, అవనిగడ్డ**

**కృష్ణా జిల్లా**

---

అంతర్జాతీయ మహిళా దినోత్సవ శుభాకాంక్షలు



దిశ చట్టం మహిళలకు రక్షణ కవచం

'అంగన్‌వాడీ వాయిస్' సామాజిక మాసపత్రికకు 4వ వార్షికోత్సవ శుభాకాంక్షలు

**సిడిపివో మరియు సిబ్బంది**

**ఐసిడిఎస్ ప్రాజెక్టు, కూనవరం**

**తూర్పుగోదావరి జిల్లా**

---

అంతర్జాతీయ మహిళా దినోత్సవ శుభాకాంక్షలు

'అంగన్‌వాడీ వాయిస్'కి

4వ వార్షికోత్సవ శుభాకాంక్షలు

**గర్భిణిగా ఉన్న సమయంలో కన్నా పాలిచ్చే సమయంలో తల్లి ఎక్కువ ఆహారం తినాలి**

**సిడిపివో మరియు సిబ్బంది**

**ఐసిడిఎస్ ప్రాజెక్టు నల్లజర్ల**

**పశ్చిమగోదావరి జిల్లా**

# వివక్షను ఎదిరించే చైతన్యం పెరగాలి

## మహిళామణులందరికి మహిళా దినోత్సవ శుభాకాంక్షలు : మంత్రి తానేటి వనిత



నేటి మహిళల్లో అడుగడుగునా ఎదురవున్న వివక్షను ఎదిరించే చైతన్యం పెరగాలని రాష్ట్ర మహిళా శిశు సంక్షేమశాఖ మంత్రి తానేటి వనిత అన్నారు. ఈ పితృ స్వామ్య సమాజంలో మహిళలకున్న కష్టాలకంటే వారు కొనితెచ్చుకుంటున్న కష్టాలు ఎక్కువైపోయాయి, సమాజం వారి మీద బలవంతంగా రుద్దే పీడన, అప చారాలు అవమానాలకు అంతేలేదన్నారు. . ఈ ముప్పేట దాడిని సమర్థవంతంగా ఎదుర్కోవాలి అంటే జరుగుతున్న దోపిడి స్వరూపాన్ని దోచుకునే విధానా లను ఎండగట్టాలన్నారు. వివక్ష విశ్వరూపాన్ని ప్రదర్శిం పచేయాలన్నారు. మహిళలు పురుషులతోపాటు అన్ని రంగాల్లో ముందుండి ఆర్థిక అభివృద్ధికి పాటు పడాలన్నారు. స్త్రీ అభివృద్ధి చెందితే సమాజం అభివృద్ధి చెందుతుందన్నారు. పిల్లలను భావిభారత ఉత్తమ పౌరులుగా తీర్చిదిద్దే బాధ్యత స్త్రీలపైనే ఉంటుందన్నారు. ఇప్పటికే సామాజిక ప్రగతిలో మహిళలు అత్యంత కీలకమైన పాత్ర పోషిస్తున్నారని వారి పనితీరు ప్రశంసనీయమన్నారు. ముఖ్యంగా మహిళలు కుటుంబంలోనూ సమాజంలోనూ తన అస్తిత్వాన్ని నిలుపుకోవడానికి తన హక్కులు కోసం లక్ష్య సాధన కోసం గుర్తింపు కోసం, ప్రేమకోసం, విలువలు కోసం కృషి చేయాలన్నారు. తమ రక్షణపై ప్రతి మహిళా అవగాహన కలిగి ఉండాలన్నారు. అంతర్జాతీయ మహిళా దినోత్సవాన్ని పురస్కరించుకుని ఇటీవల పశ్చిమగోదావరి జిల్లా కొవ్వూరులో ఆమె కార్యాలయంలో మంత్రి తానేటి వనిత మాట్లాడుతూ

గతంలో అమెరికాలో పురుషులతోపాటు సమానంగా పని చేస్తున్న మహిళలకు, పురుషులతోపాటు సమాన వేతనం కావా లని ఉద్యమాలు జరిపి సమాన వేతనం పొంది, తమ హక్కులను పొందడం జరిగింది. అప్పటినుండి మార్చి 8న అంతర్జాతీయ మహిళా దినోత్సవాన్ని ప్రపంచవ్యాప్తంగా ఘనంగా మహిళలం దరూ జరుపుకుంటున్నాం. ఇకపోతే రాష్ట్రంలోని జగనన్న పరిపా లన చూస్తూ ఉంటే మహిళలందరికీ కూడా ప్రతి రోజు కూడా మహిళా దినోత్సవమే. ఎందువలనంటే మద్యం ద్వారా రాష్ట్రం లోని ఎంతోమంది మహిళల జీవితాలు నాశనం అయిపోవడాన్ని గమనించిన మన ముఖ్యమంత్రి అంచెలంచెలుగా మద్యపాన నిషేధానికి కంకణం కట్టుకోవడం జరిగింది. పిల్లల చదువులు–తల్లికి ఆర్థిక భారం కాకూడదని పిల్లల చదువు నిమిత్తం అమ్మఒడి పథకం ద్వారా ప్రతి తల్లి అకౌంట్‌లోకి 15 వేల రూపాయలు జమ చేయడం జరిగింది. గత ప్రభుత్వాలు అమలుపరిచిన సంక్షేమ పథకాల వల్ల ఆరోజు లేదా కొంతకాలం మాత్రమే ప్రజలకు ఉపయోగకరంగా ఉండేవి. కానీ జగనన్న ప్రవేశపెట్టిన ఈ విద్యా దానం వల్ల ప్రతి విద్యార్థి కూడా బాగా చదువుకుని జీవితంలో వారి కాళ్ళ మీద వాళ్ళు నిలబడి బాగా అభివృద్ధి చెందే స్థితిని కల్పించారు. విద్యా దీవెన ద్వారా ఉన్నత చదువులు చదువుకునే విద్యార్థిని విద్యార్థులు కూడా మంచి ప్రోత్సాహాన్ని ఈ రాష్ట్రంలో కల్పించడం జరిగింది. అనారోగ్యం వల్ల పిల్లలు వారి యొక్క చదువులో వెనకబడి ఉండకుండా అన్ని పోషక



పదార్థాలతో కూడిన సమతుల ఆహారాన్ని ప్రతి ఒక్కరికి గోరు ముద్ద పథకం ద్వారా అందించడం జరుగుచున్నది. అన్ని కష్టాలు పడుతూ చదువు పూర్తి చేసుకున్న తర్వాత ఒక ఇంగ్లీషు భాష వల్ల వారి యొక్క మంచి భవిష్యత్తును పిల్లలు కోల్పోతున్నారని గ్రహించి ప్రతి ప్రభుత్వ పాఠశాలల్లో కూడా ఇంగ్లీష్ మీడియం ప్రవేశ పెట్టడం జరిగింది. దేశం మొత్తం మీద అదేవిధంగా మన రాష్ట్రంలో కూడా నెలల పిల్లల నుండి ముదుసలి మహిళ వరకు ఎవరిని వదలకుండా ప్రతివారిపై అకృత్యాలు చేసే మానవ మృగాల బారి నుండి కాపాడడానికి శ్రీరామరక్షలా ఉండే దిశ చట్టాన్ని తీసుకువచ్చిన ఘనత కూడా మన ముఖ్యమంత్రి జగన్ అన్నదే. ఈరోజు ప్రతి ఆడపిల్ల నుండి గృహిణులు, ఉద్యోగస్తులైన మహిళలు కూడా ధైర్యంగా సమాజంలో తిరుగుతూ జీవిస్తున్నారు అంటే అది జగనన్న తీసుకువచ్చిన కఠినమైన చట్టాలు అని చెప్పవచ్చు. అంతేకాకుండా బడుగు బలహీనవర్గాల మహిళలు సైతం రాజకీంగా ఎదగడం కోసం నామినేటెడ్ పదవుల్లో 50 శాతం రిజర్వేషన్ కల్పించిన ఘనత కూడా మన ముఖ్యమంత్రి జగన్ అన్నదే. ఈవిధంగా దేశ చరిత్రలో రాష్ట్ర చరిత్రలో ఎన్నడూ ఏ ప్రభుత్వాలు చేయలేనివిధంగా చట్టాలు తీసుకురావడమే కాకుండా ఆ చట్టాలు పకడ్బందీగా అమలయ్యే విధంగా చర్యలు తీసుకుంటున్నారు ముఖ్యమంత్రి మన జగనన్న. ఈ విధంగా అన్నిరకాలుగా మహిళా పక్షపాతిగా ఉంటూ మహిళల అభివృద్ధికి వారి యొక్క రక్షణకు ఒక అన్న లాగా కృషి చేస్తున్న మా రాజన్న కుమారుడు మా జగనన్నకు నా తరపున మా మహిళల తరపున మరొకసారి ధన్యవాదాలు తెలుపుకుంటున్నాను.

# 12 మంది సిడిపిఓలకు ఎపిడిలుగా పదోన్నతి

మహిళా శిశు సంక్షేమశాఖలో చాలా సంవత్సరాలు తర్వాత అన్ని అర్హతలుగల 12 మంది సిడిపిఓలకు అసిస్టెంటు ప్రాజెక్టు డైరెక్టర్లు (ఎపిడిలు)గా ఇటీవల పదోన్నతులు పొందారు. ఎప్పటినుండో ఈ పదోన్నతులు వివిధ కారణాలు మూలంగా వాయిదా పడుతూ వస్తున్నాయి. ఈ ప్రమోషన్ల విష యంలో కొంతమంది సిడిపిఓలు సైతం న్యాయస్థానాన్ని ఆశ్ర యించినప్పటికి ఫలితం దక్కలేదు. ఎట్టకేలకు 12 మంది సిడిపిఓ లకు పదోన్నతి కల్పించారు. చిత్తూరులో ఎపిడిగా పనిచేస్తున్న జి అరుణాదేవికి ప్రమోషన్ ఇచ్చి కర్నూలులో ఎపిడిగా నియమిం చారు. పశ్చిమగోదావరి జిల్లాలో ఎపిడిగా ఉంటూ ఇన్‌ఛార్జి పిడిగా కూడా పనిచేస్తున్న కెఎస్ఆర్‌విఎస్ఎన్ఎల్ విజయ కుమారిని ఇదే జిల్లాలో ఉంచారు. ప్రకాశం జిల్లా మార్కాపురం అర్బన్ ప్రాజెక్టులో సిడిపిఓలుగా పనిచేస్తున్న జి లక్ష్మీదేవిని కడప జిల్లాకు, గుంటూరు ప్రాజెక్టు డైరెక్టర్ కార్యాలయంలో నోడల్ ఆఫీసర్‌గా విధులు నిర్వహిస్తున్న ఎమ్ ప్రమీలారాణిని కృష్ణా జిల్లా ఎపిడిగా, గుంటూరు జిల్లా అమృతలూరు సిడిపిఓ అనురాధని శ్రీకాకుళం జిల్లాకి, విశాఖపట్నం జిల్లా జి మాడుగల సిడిపిఓ ఎ అనురాధని గుంటూరులోని డైరెక్టర్ కార్యాలయానికి, కర్నూలు జిల్లా ఆత్మకూరులో ఎసిడిపిఓగా పనిచేస్తున్న ఎస్ లక్ష్మీకుమారిని అనంతపురం జిల్లా ఎపిడిగా, ఎపి ఉమెన్ కమిషన్‌లో సెక్షన్ ఆఫీసర్‌గా డిప్యుటేషన్‌లో ఉన్న ఆర్ఎల్ అన్నపూర్ణని గుంటూరు డైరెక్టరేట్ కార్యాలయానికి శ్రీకాకుళం జిల్లా నరసన్నపేట సిడిపిఓ కె అనంతలక్ష్మిని విశాఖపట్నం ఎపిడిగా, కృష్ణా జిల్లా విజయవాడ అర్బన్ వన్ ప్రాజెక్టు సిడిపిఓ బి మనోరంజనిని గుంటూరు జిల్లా ఎపిడిగా, నెల్లూరు జిల్లా సూళ్ళూరుపేట సిడిపిఓ టి ఉమామహేశ్వరిని చిత్తూరు ఎపిడిగా, కర్నూలు జిల్లా నంద్యాల అర్బన్ సిడిపిఓ డి విజయలక్ష్మిని తూర్పుగోదావరి శాఖలో ఎపిడిలుగా నియమించారు.








అంతర్జాతీయ మహిళా దినోత్సవ శుభాకాంక్షలు

'అంగన్‌వాడీ వాయిస్' సామాజిక ప్రజాచైతన్య మాసపత్రికకు

వార్షికోత్సవ శుభాకాంక్షలు...

బాలామృతం బాలలకు వరం



సిడిపివో మరియు సిబ్బంది

ఐసిడిఎస్ ప్రాజెక్టు, కొత్తపేట, తూ॥గో॥ జిల్లా

# సామాజిక వేడుక జరపడానికి అంగన్‌వాడీ కార్యకర్తలకు మార్గదర్శకాలు

**ముందస్తు పనులు (కనీసం 2-3 రోజుల ముందు) :**

1. గ్రామంలో అన్ని వయస్సుల మగ మరియు ఆడవాళ్ళను ఆహ్వానించాలి.
2. ఈ కింద తెలిపిన వాళ్ళను కూడా ఆహ్వానించాలి.
   - ఎ) ఆశా & ఎఎన్ఎమ్
   - బి) పంచాయతి సభ్యులు గ్రామ విహెచ్ఎన్‌సి కమిటీ సభ్యులు మరియు సాధికార మిత్రాలు
   - సి) స్వయం సహాయక బృందాలు, స్థానిక కమిటీల సభ్యులు, ఇతర మహిళలు
   - డి) స్కూల్‌కు వెళ్ళే పిల్లలు, కిషోర వయసు బాల బాలికలు
3. వేడుకలో ఇచ్చే సమాచారంపై పూర్తి అవగాహన కలిగి ఉండాలి.

**వేడుక రోజు చేసే పనులు :**

1. అంగన్ వాడీ కేంద్రం లేదా వేడుక జరిగే ప్రదేశాన్ని శుభ్రం చేసి సిద్ధం చేయాలి. ఆహ్వానితులు అందరికి సరిపోయే రీతిలో తగిన స్థలం ఉండేలా చూసుకోవాలి.
2. ఈ క్రింద తెలిపినవి సిద్ధం చేసుకోవాలి.
   - ఎ) చేతులు పరిశుభ్రంగా కడుకున్నే పద్ధతులు ప్రదర్శించి చూపడానికి అనువైన స్థలం ఎంచుకోవాలి. (వీలైనంత ఎక్కువగా నీళ్ళు లభ్యమయ్యే చోటు చూడాలి)
   - బి) చేతులు కడుక్కోవడానికి సబ్బు
   - సి) ఒక వేళ నీళ్ళు వచ్చే కుళాయి లేకపోతే అందరికి సరిపోయే నీళ్ళను బకెట్లలో పట్టి ఉంచాలి. బకెట్ల దగ్గర తగినన్ని మగ్గులు కూడా పెట్టాలి.
   - డి) చేతులు తుడుచుకోవడానికి శుభ్రమైన టవల్
   - ఇ) (డీ వార్మింగ్) నులి పురుగుల నివారణ మాత్రలు
   - ఎఫ్) కౌన్సిలింగ్ సమయంలో తగిన సమాచారం, అవగాహన అందించడానికి కావల్సిన ఐఇసి మెటీరియల్
   - జి) కూర్చోవడానికి చాపలు
   - హెచ్) ఆహ్వానితులకు టీ, ఫలహారాలు
3. ఆహ్వానితులకు ఏం చెప్పాలనేది జ్ఞాపకం పెట్టుకోవాలి దాని కోసం కీలక సందేశాలను మరోసారి చదువుకోవాలి.

**వేడుకరోజు చేసే పనులు :**

1. అందరిని ఆహ్వానించాలి.
2. ఈ వేడుక ఉద్దేశ్యం అందరికి వివరించాలి, వేడుకకు సంబంధించిన కీలక సందేశాలను తెలియచేసి, తల్లులు, వాళ్ళ కుటుంబ సభ్యులు అందరూ గుర్తుంచుకుని వాటిని పాటించాలని చెప్పాలి. వెనుకవైపు ఉన్న విషయాలను ఆహ్వానితులకు వివరించాలి.
3. (డీ వార్మింగ్) నులి పురుగుల నివారణ మందులు అందరికి చూపిస్తూ వాటి ప్రాధాన్యతను వివరించాలి.
4. పరిసరాల పరిశుభ్రత వ్యక్తిగత పరిశుభ్రతకు సంబంధించి ఈ క్రింద తెలిపిన సమాచారం ఇవ్వాలి.
   - ఎ) చేతులు ఎందుకు శుభ్రంగా కడుక్కోవాలి మరియు ఎప్పుడెప్పుడు కడుక్కోవాలి.
   - బి) చేతులు శుభ్రంగా కడుక్కునే పద్ధతులను చేసి చూపించాలి. ఈ ప్రక్రియలో అందరూ పాల్గొనేటట్టు చేయాలి.
   - సి) ఇంటి దగ్గర చుట్టుపక్కల పరిసరాలను శుభ్రంగా ఉంచుకోవడం.
   - డి) వ్యక్తిగత పరిశుభ్రత పాటించాలి.

**ఆహ్వానితులతో మాట్లాడటం :**

1. పరిసరాల పరిశుభ్రత మరియు వ్యక్తిగత పరిశుభ్రతకు సంబంధించి ఆహ్వానితులు పాటించే పద్ధతులు గురించి అడిగి తెలుసుకోవాలి.
   - ఎ) చేతులు కడుక్కునే అలవాటు
   - బి) బహిరంగ ప్రదేశాలలో మల విసర్జన చేయకపోవడం.
   - సి) క్రమం తప్పకుండా స్నానం చేయడం, తలంటు పోసుకోవడం మరియు బ్రష్ చేసుకోవడం
   - డి) సురక్షిత తాగునీటి లభ్యత వాటి ఉపయోగం
2. కార్యక్రమంలో భాగంగా చెప్పిన విషయాలు అన్నీ గుర్తున్నాయా అని ప్రతి ఒక్కరిని అడగాలి.
3. తమ ఇంటి చుట్టుప్రక్కల గ్రామంలోని పరిసర ప్రాంతాలను పరిశుభ్రంగా ఉంచడానికి తాము ఎలా సాయపడతామో చెప్పమని ప్రతి ఒక్కరిని అడగాలి.
4. ఇంట్లో పిల్లలు ఇతర కుటుంబ సభ్యుల ఆరోగ్యకరమైన పరి



శుభ్రతా అలవాట్లను పాటించేలా చూడడానికి తామేం చేస్తారో చెప్పమని ప్రతి ఒక్కరినీ అడగాలి.

**ముగింపు :**

1. వేడుకలో చెప్పిన సలహాలు పాటిస్తామని ఆహ్వానితులు నుంచి హామీ పొందాలి.
2. తరువాత జరుపబోయే వేడుకలకు సంబంధించి సమాచారం ఇవ్వాలి.
3. సంబంధిత రిజిస్టార్ / ఫార్మాట్‌లో ఆహ్వానితుల హాజరు వివరాలు నమోదు చేయాలి.
4. సాంప్రదాయ గీతంతో వేడుకను ముగించాలి.
5. ఆహ్వానితులకు తినడానికి ఫలహారాలు అందించాలి.

**ఫాలో అప్ కోసం గుర్తుంచుకోవలసినవి :**

వేడుక జరిగిన తదుపరి వారం గృహ సందర్శన చేసి వేడుకలో భాగంగా చెప్పిన విషయాలను / సలహాలను వాళ్ళు ఎంతవరకు పాటిస్తున్నారు అనేది గమనించాలి. ముఖ్యంగా చేతులు శుభ్రంగా కడుక్కోవడం వ్యక్తిగత పరిసరాల పరిశుభ్రత పాటించడం చేస్తున్నారా లేదా అనేది తెలుసుకోవాలి.

అంటురోగాల నుండి కాపాడుకోవాలంటే చేతులు శుభ్రంగా కడుక్కోవాలి. చేతులు ఎప్పుడు కడుక్కోవాలి?

* వంట చేసే ముందు మరియు భోజనం చేసే ముందు
* మరుగుదొడ్డికి వెళ్ళి వచ్చిన తరువాత
* పశువులు మరియు పెంపుడు జంతువులను కడిగిన తరువాత
* వ్యాధిగ్రస్థులకు సేవలు చేసే ముందు మరియు తరువాత
* చేతులు అడ్డంగా పెట్టి తుమ్మినప్పుడు, లేదా దగ్గినప్పుడు

**సురక్షితమైన నీరు మరియు పరిశుభ్రత**

* వ్యాధుల నుండి దూరంగా ఉండాలంటే పరిశుభ్రమైన త్రాగునీటిని త్రాగాలి. త్రాగు నీరు ఉన్న పాత్రపై ఎప్పుడు మూత పెట్టి ఉంచాలి. శుభ్రమైన నీటి కొరకు నీటిని ఒక నిమిషము కాచాలి.
* బహిరంగ ప్రదేశాల్లో మల విసర్జన చేయకుండా మన గ్రామంలో వ్యాధులు వ్యాపించకుండా ఆపండి.
* మన గ్రామంలోని మిగత పిల్లలకు చేతి శుభ్రతపై అవగాహన కల్పిస్తూ, సబ్బుతో మీ చేతులు శుభ్రం చేసుకోండి.

**క్రిములను చంపే పద్ధతి అనుసరించి కడుపులో పెరిగే క్రిముల నుండి రక్షణ పొందండి :**

* కడుపులో నులిపురుగులు ఉండడం వల్ల తల్లీ మరియు పిల్లలలో రక్తహీనతకు దారి తీస్తుంది.
* పిల్లల కడుపులో నులి పురుగులు ఉండడం వల్ల వాళ్ళకు ఆకలి మందగించడంతోపాటు వారి శారీరక మరియు మానసిక ఎదుగుదలపై ప్రభావం చూపుతుంది.
* ప్రతి గర్భిణీ గర్భ పరీక్షలు (ఎఎన్‌సి) సమయంలో నులి పురుగుల నివారణ మాత్రలు తీసుకోవాలి.
* అంగన్‌వాడీ కేంద్రాలు మరియు స్కూళ్ళ ద్వారా పిల్లలకు నులి పురుగుల నివారణ మాత్రలు ఇవ్వాలి.

**చేతులు కడుక్కునే పద్ధతులు :**

* **చేతులు తడి చేయడం:** ధారగా పడే శుభ్రమైన నీటితో (వేడి లేదా చల్లని) చేతులు తడిచేసుకుని సబ్బు చేతులకు రాయడం.
* **నురగ రానివ్వండి :** రెండు చేతులు ఒకదానితో ఒకటి జతచేసి నురగ వచ్చే వరకు సబ్బును బాగా రుద్దండి. అరచేతి వెనుక, వేళ్ళ మధ్యలో మరియు గోళ్ళు చివర బాగా రుద్దండి.
* రుద్దడం మీ రెండు చేతులను కనీసం 20 సెకండ్ల పాటు ఒకదానితో మరొకటి రుద్ది శుభ్రం చేయాలి.
* **కడుక్కోండి :** ధారగా పడే శుభ్రమైన నీటి కింద చేతులను బాగా రుద్ది కడుక్కోండి.
* **ఆరబెట్టండి :** కడిగిన చేతులను గాలికి ఆరబెట్టుకోవాలి చీర లేదా వెనుకున్న బట్టలతో తుడుచుకోకూడదు.



**ఇల్లు మరియు ప్రజా ప్రదేశాలను పరిశుభ్రంగా ఉంచడం :**

* దగ్గినప్పుడు లేదా తుమ్మినప్పుడు చేతి రుమాలును నోటికి అడ్డంగా పెట్టుకోవడం వల్ల వ్యాధి కారక క్రిములు వ్యాప్తి చెందవు.
* తినే ముందు పండ్లు మరియు కూరగాయలను శుభ్రంగా కడగాలి.
* వ్యక్తిగత పరిశుభ్రతపై దృష్టి పెట్టాలి (స్నానం చేయడం, తల వెంట్రుకలు కడగడం, ఉతికిన బట్టలు వేసుకోవడం, పళ్ళు తోముకోవడం, గోళ్ళు కత్తిరించుకోవడం వంటివి)
* గ్రామం లేదా పట్టణాల్లో చెత్త చెదారం లేకుండా మరియు నీరు నిల్వ ఉంచకుండా చూడాలి.





## 'అంగన్‌వాడీ వాయిస్'కి
## వార్షికోత్సవ శుభాకాంక్షలు




నిజాలను నిర్భయంగా తెలియపరుస్తూ పత్రిక ప్రారంభించిన
అనతికాలంలోనే విశేష పాఠకాభిమానం పొందిన "అంగన్‌వాడీ వాయిస్"
సామాజిక ప్రజాచైతన్య మాస పత్రిక నాలుగు వసంతాలు పూర్తి చేసుకుని
5వ వసంతంలోకి అడుగిడుతున్న శుభ తరుణాన శుభాకాంక్షలు




**సి.డి.పి.ఓ మరియు సిబ్బంది**

**ఐసిడిఎస్ ప్రాజెక్టు, భోగాపురం, విజయనగరం జిల్లా**





## 'అంగన్‌వాడీ వాయిస్'కి
## 4వ వార్షికోత్సవ శుభాకాంక్షలు




స్వరం మీది పోరాటం మాది అనే నినాదంతో ప్రతినెలా
క్రమం తప్పకుండా వెలువడుతున్న "అంగన్‌వాడీ వాయిస్"
సామాజిక ప్రజా చైతన్య మాసపత్రికకు 5వ వార్షికోత్సవ శుభాకాంక్షలు...




**సి.డి.పి.ఓ మరియు సిబ్బంది**

**ఐసిడిఎస్ ప్రాజెక్టు, కొయ్యలగూడెం, ప॥గో॥ జిల్లా**




## 'అంగన్‌వాడీ వాయిస్'కి
## 4వ వార్షికోత్సవ శుభాకాంక్షలు





మహిళా శిశు సంక్షేమ శాఖలో ప్రగతిని దశదిశలా
వ్యాప్తి చెందేలా ప్రతి నెల క్రమం తప్పకుండా వెలువడుతున్న
"అంగన్‌వాడీ వాయిస్" సామాజిక ప్రజా చైతన్య మాసపత్రికకు
4వ వార్షికోత్సవ శుభాకాంక్షలు...




**సి.డి.పి.ఓ మరియు సిబ్బంది**

**ఐసిడిఎస్ ప్రాజెక్టు, విస్సాకోడేరు, ప॥గో॥ జిల్లా**










# 'అంగన్‌వాడీ వాయిస్' కు
# వార్షికోత్సవ శుభాకాంక్షలు

'స్వరం మీది పోరాటం మాది' అనే నినాదంతో ప్రతి నెల క్రమం తప్పకుండా వెలువడుతున్న 'అంగన్‌వాడీ వాయిస్' సామాజిక ప్రజా చైతన్య మాసపత్రిక 5వ వసంతంలోకి అడుగిడుతున్న సందర్భంగా శుభాకాంక్షలు...

అత్యవసర సమయాల్లో
టోల్‌ఫ్రీ నెంబర్లు

CHILD LINE 1098 NIGHT & DAY
CALL 181 WOMEN HELPLINE
112 EMERGENCY
DIAL 100 AP POLICE

## సి.డి.పి.ఓ మరియు సిబ్బంది
## ఐసిడిఎస్ ప్రాజెక్టు, పెనుమంట్ర
## పశ్చిమగోదావరి జిల్లా














'అంగన్‌వాడీ వాయిస్' సామాజిక ప్రజా చైతన్య మాసపత్రికకు

# 4వ వార్షికోత్సవ శుభాకాంక్షలు

## చేతులు శుభ్రంగా కడుక్కోండి...
## అంటురోగాల నుండి కాపాడుకోండి...

GLOBAL HANDWASHING DAY
OCTOBER 15
ALWAYS WASH YOUR HANDS!
1 BEFORE HANDLING FOOD
2 AFTER USING THE TOILET

## సి.డి.పి.ఓ. మరియు సిబ్బంది
## ఐసిడిఎస్ ప్రాజెక్టు, పెదపాడు, ప॥గో॥ జిల్లా

# సుగుణాల సునీల్ సాయపడటంలో సూపర్

## అంగన్‌వాడీ కార్యకర్త కుమార్తె అనారోగ్యం నిమిత్తం రూ. లక్ష ఆర్థిక సాయం



సమయం, సందర్భం ఏదైనా...ఎదుట వారి కోణం నుంచి ఆలోచిస్తూ వారి భావాలు అర్థం చేసుకునే గుణం కొందరిలో ఎక్కువగా ఉంటుంది. దాన్నే ఎంపతీ (సహానుభూతి) అంటారు. ఇది మెదడు పనితీరుకు సంబంధించిన అంశం. ఇలాంటి ప్రేరణ ఎక్కువగా ఉన్న వారు...ఎదుటి వారిపై జాలి చూపించి వదిలేయ కుండా, వారి కష్టాలను, బాధలను పంచుకోవాలనుకుంటారు. వారికి సాయం చేస్తూ సమస్యల నుంచి బయటపడేయాలనుకుంటారు. ఇది చాలా మంచిగుణం. ఇలాంటి ఉన్నత గుణాన్ని కల్గిన వ్యక్తి పశ్చిమగోదావరి జిల్లా పెదపాడు సిడిపివో సునీల్ రాజశేఖర్ అని చెప్పాలి. ఆయన పనిచేస్తున్న ప్రాజెక్టు పరిధిలోని ఒక అంగన్‌వాడీ కార్యకర్త కుమార్తె అనారోగ్య సమస్యతో బాధ పడుతుందని తెలుసుకుని, తన సిబ్బందికి విషయం చెప్పి వారి అందరి దాతృత్వంతో అక్షరాల లక్ష రూపాయలు అంగన్‌వాడీ కార్యకర్త కుటుంబానికి సాయం అందేలా చేసారు. వివరాల్లోకి వెళ్తే తన ప్రాజెక్టు పరిధిలోని పెదపాడు మండలం నాయుడు గూడెంలోని ఎం కవిత అనే అంగన్‌వాడీ వర్కర్ కుమార్తె జాహ్నవి లివరు సంబంధిత వ్యాధితో బాధపడుతోంది. భర్త మరణించాడు, కొడుకు అకాల మరణం చెందాడు. ఉన్న ఒక్క కుమార్తె కిడ్నీ వ్యాధితో బాధపడుతుంది. వైద్యులు కిడ్నీ ట్రాన్స్‌ప్లంటేషన్ చేయాలన్నారు. ఈ పరిస్థితుల్లో దిక్కుతోచని స్థితిలో ఉండగా విషయం తెలుసుకున్న సిడిపిఒ సునీల్ రాజశేఖర్ సహచర కార్యకర్తలకు విషయం చెప్పి వారందరి దగ్గర తలో కొంత తీసుకుని దానికి మరికొంత కలిపి లక్ష రూపాయలు ఆర్థిక సహాయంచేసి ఆ కుటుంబానికి ఆదరణగా నిలిచారు. తోటి కార్యకర్తలు స్పందించి ఈవిధంగా చేయటం పట్ల పలువురు అభినందించారు. సునీల్ ఏ ప్రాజెక్టులో పనిచేసినా ఇలాంటి పనులు చేయటం ఈయన దాతృత్వానికి నిదర్శనం అని చెప్పాలి. అందుకే అంటారు మంచి మనుష్యులు వీధిదీపాలు లాంటి వారని వీధిలైటు కాంతిని పంచటమేకాక నలుగురికి వెలుతురు ప్రసాదిస్తుంది. హేట్సాఫ్ సిడిపిఒగారు.


అధికారులకు, అనధికారులకు,
ప్రజాప్రతినిధులకు, అంగన్‌వాడీ సిబ్బందికి
**మహిళా దినోత్సవ శుభాకాంక్షలు.**
'అంగన్‌వాడీ వాయిస్'కు వార్షికోత్సవ శుభాకాంక్షలు...

**బాలల స్నేహ సమాజం నిర్మిద్దాం**
**బాలబాలికలను చైతన్యపరుద్దాం**

**సిడిపివో** మరియు **సిబ్బంది**

ఐసిడిఎస్ ప్రాజెక్టు, **గుంటూరు అర్బన్-2**, గుంటూరు జిల్లా

# మహిళల సమగ్ర రక్షణ 'దిశ'గా

## రాష్ట్రంలో మొట్టమొదటి దిశ పోలీసు స్టేషన్ ప్రారంభించిన సిఎం జగన్మోహనరెడ్డి





రాష్ట్రంలో మహిళలకు సమగ్ర రక్షణ దిశగా దిశ పోలీసు స్టేషన్ ప్రారంభించటం గర్వంగా ఉందని రాష్ట్ర ముఖ్యమంత్రి వైఎస్ జగన్మోహనరెడ్డి అన్నారు. ఇటీవల తూర్పుగోదావరి జిల్లా రాజమండ్రిలో దిశ మొట్టమొదటి పోలీసు స్టేషన్‌ను ఆయన ప్రారంభించారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ రాష్ట్రంలో అక్కా చెల్లెళ్ళకు ప్రభుత్వం అండగా ఉంటుందన్నారు. నేరస్థులతో నిర్ధాక్షణంగా వ్యవహరించాలనే ఉద్దేశ్యంతో దిశ చట్టాన్ని తీసుకొచ్చామన్నారు. దిశ చట్టం దేశ చరిత్రలో ఒక కొత్త అధ్యాయం అన్నారు. రాష్ట్రంలో శాంతి భద్రతలే తమ ప్రాధాన్య అంశమన్నారు. న్యాయం జరిగి శిక్షలు వెంటనే పడితే వ్యవస్థలో భయం పెరుగుతుందన్నారు. కోర్టు విచారణకు సంవత్సరాలు, సంవత్సరాలు పడితే న్యాయస్థానాలపై ప్రజల నమ్మకం పోతుందని తెలిపారు. వ్యవస్థలో మార్పు తేవాలన్న ఆలోచనతో దిశ చట్టం తెచ్చామని జగన్ వ్యాఖ్యానించారు. దిశ బిల్లు త్వరలో చట్టం రూపంలోకి వస్తుందని ఆశిస్తున్నామన్నారు. దిశ చట్టం ప్రకారం మహిళలకు ఎక్కడ అన్యాయం జరిగినా రెడ్‌హ్యాండెడ్ కేసుల్లో ఏడు రోజుల్లో దర్యాప్తు 14 రోజుల్లో విచారణ పూర్తి చేసి ఉరిశిక్ష వేసేలా చట్టాన్ని రూపొందించామన్నారు. 13 జిల్లాల్లోనూ దిశ కోర్టులు ఏర్పాటు చేస్తున్నామన్నారు. విశాఖపట్నం, తిరుపతిలో కొత్త ఫోరెన్సిక్ ల్యాబ్‌లు ఏర్పాటు చేయనున్నట్లు చెప్పారు. దిశ యాప్ ద్వారా వెనువెంటనే చర్యలు తీసుకునే వెసులుబాటు కల్గుతుందన్నారు. ప్లే స్టోర్‌లో ఉన్న దానిని డౌన్‌లోడ్ చేసుకోవాలని ఎస్‌ఓఎస్ బటన్‌పై నొక్కితే వెంటనే అందరికి సమాచారం వెళ్తుందన్నారు. పది సెకన్లలో మొబైల్ టీమ్స్ చేరుకుంటాయని చెప్పారు. వచ్చే మూడు నాలుగు నెలల్లో దిశ చట్టం అందుబాటులోకి వస్తుందని ఆశాభావం వ్యక్తం చేసారు. పురుషులతో సమానంగా మహిలలకు అవకాశాలు ఉండాలన్నారు. ఓ అన్నగా, తమ్ముడిగా, వారి పిల్లలకు మంచి మేనమామగా ఆలోచన చేస్తున్నామని పేర్కొన్నారు. అధికారంలోకి వచ్చిన ఎనిమిది నెలల్లోనే 42 లక్షల మంది పిల్లలకు మేలు చేసే అమ్మఒడి కార్యక్రమాన్ని తీసుకువచ్చామన్నారు. ఇప్పుడు తాజాగా మహిళలు, బాలలు భద్రత కోసం ప్రభుత్వం ఎంతో ప్రతిష్టాత్మకంగా దిశ చట్టాన్ని తెచ్చిందన్నారు. మహిళా మంత్రులు, శాసనసభ్యులతో కలిసి దిశ ప్రత్యేక పోలీసు స్టేషన్‌ను జగన్ పరిశీలించారు. హోంమంత్రి సుచరిత, తానేటి వనిత, ఎంఎల్ఎ రోజా, మహిళా కమిషన్ ఛైర్‌పర్సన్ వాసిరెడ్డి పద్మ, డిజిపి గౌతమ్ సవాంగ్, దిశ చట్టం పర్యవేక్షకురాలు, ఐపిఎస్ అధికారిణి దీపికా పాటిల్, మహిళా శిశు సంక్షేమశాఖ డైరెక్టర్ కృతికా శుక్లా సిఎం వెంట ఉన్నారు. దిశ పోలీసు స్టేషన్ ప్రారంభించిన అనంతరం ఆదికవి నన్నయ్య యూనివర్శిటీ ఆడిటోరియంలో దిశ యాప్‌ను లాంచ్ చేశారు. హైదరాబాద్‌లో జరిగిన దిశ సంఘటన దేశవ్యాప్తంగా చర్చనీయాంశమైందని, చిన్నారులపైనా, అఘాయిత్యాలు జరుగుతున్నాయని ఆవేదన వ్యక్తం చేశారు. కొంతమంది మద్యం సేవించి రాక్షసులుగా మారి అత్యాచారాలకు పాల్పడుతున్నారని మండిపడ్డారు. అలాంటి క్రూరులను శిక్షించాలని ప్రతి ఒక్కరికి ఉంటుందని, అయితే సినిమాల్లో చూపించేవిధంగా వ్యవస్థలో స్వేచ్ఛ ఉండదని పేర్కొన్నారు. ప్రభుత్వాలు మారుతున్నా మహిళలకు భద్రత

కరువైందని ఆవేదన వ్యక్తం చేశారు. నేరం చేస్తే శిక్ష పడుతుందనే భయం ఉన్నప్పుడే అకృత్యాలు తగ్గుతాయని పేర్కొన్నారు. నేరాలను అదుపుచేసే వ్యవస్థలో మార్పు చేసేందుకు దిశ చట్టాన్ని తీసుకువచ్చామన్నారు. ఫోరెన్సిక్ ల్యాబ్‌లు ఏర్పాటుకు 31 కోట్లు నిధులు విడుదల చేసామని, 18 పోలీసు స్టేషన్లలో 47 మంది డిఎస్‌పి స్థాయి నేతృత్వంలో పనిచేస్తారని చెప్పారు. 13 జిల్లాల్లో ప్రత్యేక కోర్టులు ఏర్పాటుకు సైతం 26 కోట్లు విడుదల చేసామని హైకోర్టు అనుమతితో వీటిని ఏర్పాటు చేయనున్నట్లు చెప్పారు. ప్రతి అడుగులోనూ అక్కా చెల్లెమ్మలకు అండగా ఉంటానని జగన్ హామీ ఇచ్చారు. ఈ కార్యక్రమానికి రాష్ట్రవ్యాప్తంగా ఎపిడిలు, వన్‌స్టాప్ సెంటర్ సిబ్బంది, ఐసిడిఎస్ అధికారులు అధిక సంఖ్యలో పాల్గొన్నారు. తొలుత ఈ కార్యక్రమం ముందు రోజు జరగాల్సి ఉంది కానీ అనివార్య కారణం మూలంగా మరుసటి రోజు ఈ కార్యక్రమం జరిగింది.

# అంగన్‌వాడీ కేంద్రాలను తనిఖీ చేసిన ఉమెన్ కమీషన్ మెంబరు వాణి

కర్నూలు జిల్లా కర్నూలులో ఇటీవల ఎపి ఉమెన్ కమిషన్ మెంబరు అంచల వాణి పర్యటించి స్థానిక అంగన్‌వాడీ కేంద్రాలను, స్వధార్ హోమ్, దిశవన్‌స్టాప్ సెంటర్లను తనిఖీ చేసి సంతృప్తి వ్యక్తం చేశారు. స్థానిక ఇందిరాగాంధీ స్మారక ఉన్నత పాఠశాల సమీపంలోని బుధవారపుపేట అంగన్‌వాడీ కేంద్రాన్ని దర్శించి లబ్ధిదారులతో మాట్లాడారు. అంగన్‌వాడీ కేంద్రాల ద్వారా అందుతున్న సేవలుపై ఆరా తీసారు. ప్రతిరోజు ఎలాంటి ఆహారం సరఫరా చేస్తున్నారు, పాలు గుడ్లు, బాలామృతం వంటివి సక్రమంగా అందుతున్నవి లేనిది అడిగి తెలుసుకొని లబ్ధిదారులు ఇచ్చిన సమాధానంతో సంతృప్తి వ్యక్తం చేశారు. అనంతరం దిశ వన్‌స్టాప్ సెంటర్‌కి వెళ్ళి అక్కడ పరిస్థితులను అడిగి తెలుసుకున్నారు. ఇప్పటివరకు నమోదు అయిన కేసుల వివరాలు, ఎంతమంది సిబ్బంది పనిచేస్తున్నారు. అక్కడ ఉన్న మౌళిక సదుపాయాలు తదితర విషయాలను అడిగారు. అక్కడ నుండి స్వధార్ హోమ్‌కి వెళ్ళి అక్కడ పునరావాసం పొందుతున్న వారి వివరాలు అడిగి వారితో మాట్లాడారు. అనంతరం సర్వశిక్షాభియాన్ ఆధ్వర్యంలో నడపబడుచున్న ప్రత్యేక అవసరాలగల పిల్లల పాఠశాలను తనిఖీ చేసారు. అక్కడ ఉన్న వికలాంగ పిల్లలతో ముచ్చటించారు. తొలిసారిగా జిల్లాకి వచ్చిన మెంబరు అంబల వాణికి ఐసిడిఎస్ సిబ్బంది ఘనంగా స్వాగతం పలికారు. ఈమె వెంట అర్బన్ సిడిపిఒ వరలక్ష్మి, ఎపిడి విజయ పాఠశాల ఉపాధ్యాయులు, పోలీసు సిబ్బంది ఉన్నారు.








అంతర్జాతీయ మహిళా దినోత్సవ శుభాకాంక్షలు

'అంగన్‌వాడీ వాయిస్' సామాజిక ప్రజా చైతన్య మాసపత్రికకు

వార్షికోత్సవ శుభాకాంక్షలు

గర్భిణీకి ప్రసవం ముందు ఆరోగ్యపరీక్షలు

గర్భపరీక్షలు తప్పక చేయించాలి

సిడిపివో మరియు సిబ్బంది

ఐసిడిఎస్ ప్రాజెక్టు, రాజానగరం, తూర్పుగోదావరి జిల్లా



# అద్దె వాహనాలు లేక అవస్థలు

## ★ చేతి చమురు వదిలించుకుంటున్న సిడిపిఒలు

## ★ ఆర్థికశాఖ ఆమోదం లేదంటున్న అధికారులు

రాష్ట్రవ్యాప్తంగా ఉన్న మహిళా శిశు సంక్షేమశాఖ ప్రాజెక్టు కార్యాలయాల్లో సిడిపిఒలకు వాహనాలు లేక నానా అవస్థలు పడుతున్నారు. ప్రాజెక్టు పరిధిలో ఉన్న వందలాది అంగన్‌వాడీ కేంద్రాలను పర్యవేక్షించాలంటే ఇబ్బందులు పడుతున్నామని వాపోతున్నారు. పాత వాహనాల స్థానంలో కొత్త వాహనాల మంజూరుకు ఆమోదం నిమిత్తం ఫైల్ పంపినప్పటికి ఆర్థికశాఖ అనుమతికోసం నెలల తరబడి ఫైళ్ళు అక్కడే మూలుగుతున్నాయని ఆవేదన వ్యక్తం చేస్తున్నారు. ఒకప్రక్క ప్రజాప్రతినిధులు, అధికారులు పర్యవేక్షణ కొరవడింది. సిడిపిఒలు సరిగ్గా తనిఖీలు నిర్వహించటంలేదంటూ తమపై అసహనం వ్యక్తం చేస్తున్నారని ఆందోళన చెందుతున్నారు. కార్యాలయానికి కారు సదుపాయం లేకుండా తాము ఎక్కడికి తిరగాలి అంటూ ఉన్నత అధికారులను ప్రశ్నిస్తున్నారు. ఒక్కో ప్రాజెక్టులో కనీసం 150కిపైగా అంగన్‌వాడీ కేంద్రాలుంటాయని వాటినన్నిటిని తనిఖీ చేయాలంటే తమకు కష్టంగా ఉంటుందని పేర్కొంటున్నారు. ప్రస్తుతం ఇతర ప్రాజెక్టులలో ఉన్న వాహనాలకు సైతం అద్దెలు సకాలంలో రాకపోవటం మూలంగా వాహన యజమానులు మహిళా శిశు సంక్షేమశాఖకి అద్దె వాహనాలు ఏర్పాటుకు సుముఖత చూపటం లేదని తెలియవచ్చింది. ఏజెన్సీ ప్రాంతాల్లో అయితే సిడిపిఒలు నానా అవస్థలు పడుతున్నారు. అంగన్‌వాడీ కేంద్రాలు విసిరేసినట్లు అక్కడో చోట, అక్కడోచోట ఉంటాయి. కొన్ని కొండ ప్రాంతాల్లో, కొండలపైన కొలువుతీరి ఉంటాయి. ద్విచక్రవాహనం కూడా వెళ్ళటానికి వీలులేని కేంద్రాలు ఉన్నాయి. ఈ పరిస్థితుల్లో ప్రాజెక్టు పరిధిలో ఉండే అంగన్‌వాడీ కేంద్రాలను తనిఖీ చేయాలంటే చాలా ఇబ్బందికరంగా ఉంటుందని సిడిపిఒలు వాపోతున్నారు. సిడిపిఒ నెలకు ఇన్ని అంగన్‌వాడీ కేంద్రాలని తప్పక తనిఖీ చేయాల్సి ఉంటుంది. కేవలం తనిఖీలు మాత్రమే కాక జిల్లా స్థాయిలో డైరెక్టరేట్ స్థాయిలో, మండల స్థాయిలో జరిగే సమావేశాలతోపాటు బిఆర్‌జి, డిఆర్‌జి, ఎస్ఆర్‌జి వంటి శిక్షణలకు సైతం వెళ్ళాల్సి వస్తుంది. ఈ పరిస్థితుల్లో వాహనం



లేకపోతే ఎన్ని ఇబ్బందులు పడుతున్నారో అర్థం చేసుకోవచ్చు. కొన్ని ప్రాజెక్టులలో కాలం చెల్లిన జీపులు ఉన్నాయి అవి కూడా తగిన సామర్థ్యం కలిగి ఉండవు. కేంద్ర మోటారు వాహన నిబంధనల మేర 15 ఏళ్ళకు పైబడిన వాహనాలని వినియోగించకూడదని నిబంధనలు సైతం విధించారు. ఐసిడిఎస్ ప్రాజెక్టులు జిల్లా కేంద్రానికి చాలా దూరంలో ఉంటాయి ఏదైనా పనిమీద పిడి కార్యాలయానికి రావాలన్నా ఇబ్బందే. వాహనాలు లేక బస్సుల్లోను, ఆటోల్లోను ప్రయాణించి విధులు నిర్వర్తించవలసి వస్తుందని, ఆరోగ్యపరంగా సమస్యలు కూడా ఉత్పన్నమవుతున్నాయి అంటున్నారు. అయితే అద్దె వాహనాలు వినియోగిస్తున్న కొందరు నిబంధనలు పాటించకుండా తమ ఇష్టారాజ్యంగా వ్యవహరిస్తున్నారనే ఆరోపణలు కూడా ఉన్నాయి. హయ్యర్ వెహికల్ నిబంధనలు ప్రకారం వాహనం కార్యాలయం పరిధిలోనే తిరగాలి. నెలకు ఇన్ని కిలోమీటర్లు లెక్కన తిరగాలి గాని అవేమి పట్టించుకోకుండా స్వంత పనులకు సైతం వాడుకుంటున్నారనే విమర్శలు కూడా ఉన్నాయి. ఐసిడిఎస్‌లో గతంలో ఎన్నడూ లేనివిధంగా పనిభారం పెరిగింది. స్కీమ్‌లు సైతం పెరిగాయి. దీంతో క్షేత్రస్థాయి తనిఖీలు ప్రాముఖ్యత పెరిగింది. కాబట్టి ఉన్నత అధికారులు ఆలోచించి వాహనాలు లేని ప్రాజెక్టులను గుర్తించి తక్షణమే అద్దె వాహనాలను ఏర్పాటు చేయాలని సిడిపిఒలు కోరుతున్నారు.




# అభివృద్ధిపథంలో వైఎస్ఆర్ కడప జిల్లా
# మహిళా శిశు సంక్షేమ శాఖ





## 'అంతర్జాతీయ మహిళా దినోత్సవ శుభాకాంక్షలు





## పోషణ్ అభియాన్
## ఇంటింటి పోషణ సంబరాలు

పోషణ అభియాన్‌లో భాగస్వాములవుదాం
శక్తివంతమైన భావితరాలను నిర్మిద్దాం

మహిళాభివృద్ధి మరియు శిశు సంక్షేమ శాఖ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం




నా కుటుంబ పోషణ
నా బాధ్యత

8-22 మార్చి, 2020

మాతా శిశు మరణాలు మార్పుతో నివారిద్దాం... గర్భిణీ స్త్రీ నమోదు
ప్రతి మహిళ తాను గర్భం దాల్చిన విషయం తెలుసుకుని
సమీప అంగన్‌వాడీ కేంద్రంలో పేరు నమోదు చేసుకోవాలి

## ప్రాజెక్టు డైరెక్టర్ మరియు సిబ్బంది
## సిడిపివో, ఎసిడిపిఒలు
## సూపర్‌వైజర్లు, కార్యకర్తలు
## వై.ఎస్.ఆర్. కడప జిల్లా








'అంగన్‌వాడీ వాయిస్' కు
వార్షికోత్సవ శుభాకాంక్షలు

పత్రికను ప్రారంభించిన అనతికాలంలోనే పాఠకుల ఆదరణ సొంతం చేసుకున్న
'అంగన్‌వాడీ వాయిస్' మాసపత్రికకు 4వ వార్షికోత్సవ శుభాకాంక్షలు



బాల్య వివాహాలు బహు అనర్థాలు
సరైన వయస్సులోనే వివాహాలు చేద్దాం

సి.డి.పి.ఓ మరియు సిబ్బంది
ఐసిడిఎస్ ప్రాజెక్టు, పోడూరు, పశ్చిమగోదావరి జిల్లా







'అంగన్‌వాడీ వాయిస్'
ప్రజా చైతన్య మాసపత్రికకు
4వ వార్షికోత్సవ శుభాకాంక్షలు

గర్భిణీకి ఐదు నూర్లు...
తల్లీబిడ్డకు నిండు నూరేళ్ళు



దిశ చట్టం
మహిళలకు
రక్షణ కవచం

సి.డి.పి.ఓ. మరియు సిబ్బంది
ఐసిడిఎస్ ప్రాజెక్టు
సమిశ్రగూడెం, పశ్చిమగోదావరి జిల్లా

# ఖచ్చితమైన భద్రతే దిశ పోలీస్‌స్టేషన్ ముఖ్యలక్షణం

## ప్రారంభోత్సవంలో ప॥గో॥ జిల్లా కలెక్టర్ ముత్యాలరాజు






దిశ చట్టం అంటేనే మహిళల భద్రత కోసం ఏర్పాటు చేసిందని అందులో భాగంగానే దిశ పోలీస్ స్టేషన్లను ప్రారంభిస్తున్నామని, ఖచ్చితమైన భద్రత దిశ పోలీస్ స్టేషన్ యొక్క ముఖ్య లక్షణం అని పశ్చిమగోదావరి జిల్లా కలెక్టర్ ముత్యాలరాజు తెలిపారు. రాష్ట్రంలో దిశ పోలీస్ స్టేషన్లో ఏర్పాటుకు ప్రభుత్వం శ్రీకారం చుట్టింది ఈ నేపథ్యంలో గత కొద్ది రోజుల క్రితం తూర్పుగోదావరి జిల్లా రాజమండ్రిలో విశాఖపట్నం గుంటూరు వంటి ప్రాంతాలలో పోలీస్ స్టేషన్ నుండి ప్రారంభించారు ఈ క్రమంలోనే పశ్చిమగోదావరి జిల్లా ఏలూరు నగరంలోని ప్రాంతంలో ఇప్పటికే అందుబాటులో ఉన్న మహిళా పోలీస్ స్టేషన్ పోలీస్ స్టేషన్ గా మారుస్తూ పోలీస్ ఉన్నతాధికారులు ఆదేశాలు జారీ చేశారు ఈ పోలీస్ స్టేషన్‌ను జిల్లా కలెక్టర్ రేవు ముత్యాలరాజు, ఏలూరు రేంజ్ డిఐడి కె.వి.మోహనరావు, జిల్లా ఎస్పీ నవదీప్ సింగ్ గ్రేవాల్ కలిసి ప్రారంభించారు. ఈ సందర్భంగా కలెక్టర్ మాట్లాడుతూ ప్రభుత్వం ఎంతో ప్రతిష్టాత్మక ప్రవేశపెట్టిన దిశచట్టం మహిళలకు ఎంతో రక్షణగా ఉంటుందన్నారు. మహిళలను వేధించేవారికి తక్కువ సమయంలో శిక్ష పడి బాధిత మహిళలకు సత్వర న్యాయం జరుగుతుందన్నారు. మహిళలు, కాలేజీ విద్యార్థినులు దిశ యాసను డౌన్‌లోడ్ చేసుకుని అవసరమైన సమయంలో ఉపయోగించడం ద్వారా సత్వర రక్షణ పొందవచ్చునన్నారు. ఇంతవరకు 12లక్షల మందికి పైగా మహిళలు, విద్యార్థినులు దిశయాప్‌ను డౌన్‌లోడ్ చేసుకున్నారన్నారు. అధికారులు, కాలేజీ యాజమాన్యం కాలేజీలోని ప్రతి విద్యార్థినులతో దిశయాపను డౌన్‌లోడ్ చేయించాలని సూచించారు. అనంతరం ఏలూరు రేంజ్ డిఐడి కె.వి.మోహనరావు మాట్లాడుతూ సత్వర న్యాయం దిశ ధ్యేయమన్నారు మహిళలు ఒంటరిగా ఎదుర్కొనేంత ధృడంగా ఉండాలన్నారు. కష్టాల్లో ఎదురైనప్పుడు, రక్షణ కావాల్సి వచ్చినప్పుడు సంకోచించకుండా దిశ యాప్ ద్వారా పోలీసుల రక్షణ కోరాలన్నారు. మహిళల రక్షణ భద్రతకు పోలీసులు 24 గంటలూ అన్ని వేళల్లో సిద్ధంగా ఉన్నారన్నారు. మహిళలు దిశ యాప్‌లోని బటన్ నొక్కడం ద్వారా సమాచారం విజయవాడలోని కంట్రోల్ రూమ్‌కి వెళుతుందని, ఆ వెంటనే బాధిత మహిళకు ఒక సమాచారం అందడమే కాకుండా దగ్గరలోని పోలిస్ స్టేషన్ కు సమాచారం అంది సత్వరం సహాయం అందుతుందన్నారు. జిల్లా ఎస్పీ నవదీప్ సింగ్ మాట్లాడుతూ మహిళలు, విద్యార్థినులు తమ ఫోన్లలో 112, 100, 1098 నెంబర్లతోపాటు 9121211100, 955035110 నెంబర్లను ఫీడ్ చేసుకుని అవసరమైన సమయాలలో ఉపయోగించడం ద్వారా సత్వర రక్షణ పొందగలరన్నారు. దిశ యాస్‌లోని బటన్ నొక్కడం ద్వారా కేవలం 7 నిమిషాలలో స్పందించి పోలీస్ సహాయం అందుతుందన్నారు. ఇటీవల ఒకబస్‌లో ఒక మహిళను వేధించిన సంఘటనలో 1 నిమిషాలలోనే సంఘటన జరిగిన బస్సు గుర్తించడం, ఆవ్యక్తిని అదుపులోకి తీసుకుని 24 గంటల్లోగా చార్జిషీట్ వేయడం జరిగిందని వెల్లడించారు. దిశయాప్లో బటన్ నొక్కడం ద్వారా మహిళ ఉండే లొకేషన్ వీడియో అన్ని దిశపోలీస్ స్టేషన్లకు వెళుతుందని, దగ్గరలోని పోలీస్ అధికారులు వెంటనే స్పందించి సంఘటన జరిగే ప్రాంతానికి చేరుకుంటారని చెప్పారు. మహిళలను వేధించే



వారిపై వేగంగా చర్యలు ఉంటాయన్నారు పశ్చిమగోదావరి జిల్లాలో ఇంతవరకు 4 కేసుల్లో ఎఫ్ఐఆర్ నమోదు చేయడం జరిగిందని వివరించారు ఏలూరులో ఉన్న మహిళా పోలీస్ స్టేషన్‌ను దిశ మహిళా పోలీస్ స్టేషన్‌గా మార్చడం జరిగిందని వేదింపులు, మానభంగాలు వంటి కేసులు ప్రయారిటీ ప్రకారం త్వరితగతిన పరిష్కరించడం జరుగుతుందన్నారు. దిశ పోలీస్ స్టేషన్‌లో ఒక డిఎస్‌పి, ఒక సిఐ, ఐదుగురు ఎస్ఐలతోపాటు పూర్తిస్థాయిలో ఇతర సిబ్బంది ఎల్లప్పుడూ అందుబాటులో ఉంటారన్నారు. దిశ మహిళా పోలీస్‌స్టేషన్ ఒక ఫ్రెండ్లీ పోలీస్ స్టేషన్‌గా ఉంటుందని త్వరలో పూర్తిస్థాయిలో అన్ని మౌళిక సౌకర్యాలతోపాటు ఎన్నో మార్పులు తీసుకువస్తామని చెప్పారు. ఈ సందర్భంగా దిశయాప్ ఏవిధంగా డౌన్ లోడ్ చేసుకోవాలో, ఏ విధంగా ఉపయోగించాలో డిఐజి, ఎస్పీలకు సిబ్బంది వివరించారు. ముందుగా ప్రపంచ మహిళా దినోత్సవం సందర్భంగా జిల్లా కలెక్టర్ రేవు ముత్యాలరాజు, ఏలూరు రేంజ్ డిఐడి కె.వి మోహనరావు, జిల్లా ఎస్పీ నవదీప్ సింగ్ లు మహిళలకు శుభాకాంక్షలు తెలియజేశారు. ఈ కార్యక్రమంలో దిశ మహిళా పోలీస్ స్టేషన్ డిఎపి జివిఎస్ పైడేశ్వరరావు, ఏలూరు డిఎస్‌పి డాక్టర్ ఒ దిలీప్ కిరణ్, సిఐలు ఆది ప్రసాద్ శ్రీనివాసరావు ఎం ఆర్ఎల్ఎస్ఎస్ మూర్తి ఎస్సైలు కిషోర్ బాబు నాగేంద్ర ప్రసాద్ రామకోటేశ్వరరావు గంగాభవాని సురేష్ ప్రసాద్ వెంకటరమణ సిబ్బంది తదితరులు పాల్గొన్నారు.

# సహాయకులకు సత్కారం

కర్నూలు జిల్లా కర్నూలు అర్బన్ ప్రాజెక్టులో పదవీ విరమణ పొందిన ఇద్దరు అంగన్‌వాడీ సహాయకులకు ఆ ప్రాజెక్టు సిడిపిఒ వరలక్ష్మి ఘనంగా సత్కరించి పదవీ విరమణ శుభాకాంక్షలు తెలియజేశారు. వివరాల్లోకి వెళ్తే ప్రాజెక్టు పరిధిలోని 2వ సెక్టార్ పరిధిలోని వడ్డేగేరె అంగన్‌వాడీ కేంద్రంలో సహాయకురాలుగా పనిచేస్తున్న హనుమక్క మూడవ సెక్టార్ పరిధిలోని ఆర్‌కె స్ట్రీట్ అంగన్‌వాడీ కేంద్రం హెల్పర్ లక్ష్మమ్మ గత నెల ఫిబ్రవరి 29న పదవీ విరమణ పొందారు. ఎన్నో ఏళ్ళుగా అంకితభావంతో పనిచేసి సమర్ధవంతంగా వారి సేవలను అందించారనే అభిమానంతో ప్రాజెక్టు అంతా ఏకమై పదవీ విరమణ సమావేశం ఏర్పాటు చేసి ఇరువురిని గొప్పగా సన్మానించారు. ఈ సందర్భంగా సిడిపిఒ మాట్లాడుతూ తాము చేస్తున్న పని చిన్నదా? పెద్దదా అని కాకుండా బాధ్యతతో ఇన్ని సంవత్సరాలు ఎంతో



నమ్మకంగా పనిచేయటం విశేషమని వారి సేవలను కొనియాడారు. అనంతరం పర్యవేక్షకులు కార్యకర్తల నడుమ వారి ఇద్దరిని సత్కరించి తమ అభిమానాన్ని చాటుకున్నారు. హెల్పర్లు పదవీ విరమణ చేసినాగాని సిడిపిఒ స్పందించి ఈ విధంగా చేయటం విశేషమని స్థానికులు చర్చించుకున్నారు.




అంతర్జాతీయ మహిళా దినోత్సవ శుభాకాంక్షలు


'అంగన్‌వాడీ వాయిస్' సామాజిక ప్రజా చైతన్య మాసపత్రికకు
వార్షికోత్సవ శుభాకాంక్షలు
ఆపదలో ఉన్న మహిళలకు ఆపన్న హస్తం

ఆంధ్రప్రదేశ్ దిశ 2019 చట్టం
సిడిపివో మరియు సిబ్బంది
ఐసిడిఎస్ ప్రాజెక్టు, వేటపాలెం, ప్రకాశం జిల్లా

మహిళల కోసం...

# పార్లమెంట్‌లో చేసిన చట్టాలు

మహిళల రక్షణకు పార్లమెంట్‌లో కొన్ని చట్టాలు చేశారు. భారతీయ శిక్షాస్మృతి (ఇండియన్ పీనల్‌కోడ్-1860)లో లైంగిక నేరాలకు సంబంధించి ప్రత్యేక సెక్షన్లు ఉన్నాయి. అవేంటో తెలుసుకుందాం!

* 375-అత్యాచారం సెక్షన్ - కనీసం - 7 సంవత్సరాలు జైలు.
* 376 - అత్యాచారానికి శిక్ష - గరిష్టం - పది సంవత్సరాలు లేక జీవిత ఖైదు, జరిమాన.
* 376-భార్య 12 సంవత్సరాలలోపు అయితే, మానభంగానికి సామూహిక అత్యాచారం కేసులో గరిష్ఠం-2 సంవత్సరాలు, జరిమానా.
* కస్టడీలో ఉన్న మహిళపై అత్యాచారం కేసులో పోలీసు అధికారికి, జైలు అధికారికి, మరే ప్రభుత్వ అధికారి, ఆసుపత్రి అధికారి, గ్యాంగ్ రేప్, గర్భిణీ మీద అత్యాచారం - 5 సంవత్సరాల జైలు జరిమానా.
* 376-ఎ - కోర్టు ఉత్తర్వు ద్వారా విడిగా ఉన్న భార్యతో లైంగిక సంబంధానికి - 2 సవత్సరాలు జైలు, జరిమానా.
* 376-బి, 376-సి - ప్రభుత్వ అధికారుల పదవీ దుర్వినియోగంతో అత్యాచారం చేస్తే - 5 సంవత్సరాల జైలు, జరిమాన.
* 377 - అసహజ లైంగిక చర్యలు - 10 సంవత్సరాలు జైలు, జరిమాన.
* వ్యభిచార నిరోధక చట్టం (1956) - మహిళలను వ్యభిచార రొంపిలోకి లాగకుండా ఇది రక్షణ కల్పిస్తుంది.
* మహిళల అసభ్య ప్రదర్శన నిరోధక చట్టం (1986) - మహిళలను కించపరిచేలా అడ్వర్‌టైజ్‌మెంట్, బొమ్మలు, రాతలు, నగ్నచిత్రాలు మొదలైనవి దీని ద్వారా నిరోధించారు.
* సతి నిరోధక చట్టం (1987) - భర్త మరణిస్తే అతడి భౌతికకాయంతో పాటు భార్యను బలవంతంగా చితిపై దహనం చేసే అనాగరిక చర్య నుంచి మహిళలకు ఇది రక్షణ కల్పిస్తుంది.
* వరకట్న నిషేధ చట్టం (1961) - వివాహానికి ముందుకానీ, వివాహం తర్వాత కానీ వరకట్నం ఇవ్వడం, లేదా తీసుకోవడాన్ని ఇది నిషేధిస్తుంది.
* గర్భ నిరోధక నివారణ చట్టం (1971) - మహిళల ఇష్టానికి వ్యతిరేకంగా గర్భవిచ్ఛిత్తికి ఒత్తిడి చేయకుండా వారికి ఈ చట్టం రక్షణ కల్పిస్తుంది.
* ముస్లిం వివాహాల రద్దు చట్టం (1939) - తన వివాహాన్ని రద్దు చేసుకునే హక్కుని ముస్లిం స్త్రీలకు ఈ చట్టం అవకాశం కల్పిస్తుంది.
* విడాకులు పొందిన ముస్లిం మహిళల రక్షణ చట్టం (1939) - భర్త నుంచి విడాకులు పొందిన ముస్లిం స్త్రీల హక్కులు కాపాడేందుకు ఈ చట్టం చేశారు.
* కుటుంబ న్యాయస్థానాల చట్టం (1984) - కుటుంబ తగాదాలను త్వరితగతిన పరిష్కరించేందుకు ప్రత్యేక న్యాయస్థానాలను ఈ చట్టం కింద ఏర్పాటు చేశారు.
* లీగల్ సర్వీసెస్ అథారిటీ చట్టం (1987) - దీని ద్వారా ప్రభుత్వం స్త్రీలకు ఉచిత న్యాయ సలహా అందిస్తుంది.
* హిందూ వివాహ చట్టం (1955) - ఈ చట్టం ప్రకారం హిందూ మహిళ వివాహ, విడాకుల విషయంలో పురుషుడితో సమాన హక్కులు కలిగి ఉంటుంది. ఈ చట్టం ఏకపత్నీ విధానం. కొన్ని సందర్భాల్లో స్త్రీ తన భర్త నుంచి విడాకులు పొందే హక్కు కల్పిస్తుంది.
* మహిళలకు కనీస వేతన చట్టం (1948) - లింగ వివక్ష ఆధారంగా స్త్రీలకు కనీస వేతనాన్ని పురుషుడి కంటే తక్కువ నిర్దేశించరాదు.
* ఫ్యాక్టరీ చట్టం (1948) - గనులు, ఫ్యాక్టరీల్లో పనిచేసే స్త్రీలతో సాయంత్రం 7 గంటల నుంచి ఉదయం 6 గంటల మధ్య పనిచేయించరాదు.
* హిందూ వారసత్వ చట్టం (1956) - ఈ చట్టాన్ని 2005లో సవరించారు. ఈ చట్టం ప్రకారం మహిళలకు తమ తండ్రి ఆస్తిలో పురుషుడితో సమాన హక్కు ఉంది.
* భారతీయ క్రిస్టియన్ వివాహాల చట్టం (1872) - క్రైస్తవ వివాహాలకు, విడాకులకు సంబంధించిన అంశాలు ఇందులో పొందుపరిచారు.
* సమాన వేతన చట్టం (1976) - స్త్రీ, పురుషులకు సమాన పనికి సమాన వేతనం కల్పించాలి. లింగ వివక్ష ఆధారంగా స్త్రీలకు వేతనాలు తగ్గించరాదు.
* మాతృత్వ ప్రయోజనాల చట్టం (1961) - పని చేసే మహిళలకు ప్రసూతి ముందు, ప్రసూతి అనంతరం కొన్ని ప్రత్యేక ప్రయోజనాలు కల్పించాలని ఈ చట్టం నిర్దేశిస్తుంది.
* గృహహింస నిరోధక చట్టం (2005) - ఎవరైనా కుటుంబసభ్యులు స్త్రీల పట్ల లైంగిక వేధింపులు, శారీరక, మానసిక మాటలతో వేధిస్తే ఈ చట్టం రక్షణ కల్పిస్తుంది.

# మహిళలు చట్టాలపై అవగాహన పెంచుకోవాలి

మహిళా సాధికారతే ధ్యేయంగా నేడు స్త్రీ అన్ని రంగాల్లో రాణించటం అభినందనీయమని రాష్ట్ర మహిళా శిశు సంక్షేమ శాఖ మంత్రి తానేటి వనిత అన్నారు. పశ్చిమగోదావరి జిల్లా నిడదవోలులో గార్డ్స్ ఫర్ ఆర్‌టిఐ స్వచ్ఛంద సంస్థ ఆధ్వర్యంలో అంతర్జాతీయ మహిళా దినోత్సవం సందర్భంగా స్థానిక మున్సిపల్ కౌన్సిల్ హాలు నందు ఏర్పాటు చేసిన సమాచార హక్కు చట్టం - మహిళా సాధికారత అనే అంశంపై జరిగిన కార్యక్రమంలో తానేటి వనిత ముఖ్యఅతిథిగా పాల్గొని ప్రసంగించారు. మహిళలు తమ నిర్ణయాలు వాళ్ళంతట వాళ్ళే తీసుకోవాలని, వ్యక్తిగత నైపుణ్యత పెంపొందించుకోవాలని హితవు పలికారు. మహిళలు ఆత్మవిశ్వాసంతో ముందుకు సాగితే అనుకున్న లక్ష్యానికి చేరువకావచ్చని పిలుపునిచ్చారు. అలాగే తమ కుటుంబసభ్యులతో పాటు తమ చుట్టుప్రక్కల వారికి కూడా సామాచార హక్కు చట్టంపై అవగాహన కల్పించాలని సూచించారు. ముఖ్యంగా స్త్రీలు ప్రశ్నించే తత్వం అలవర్చుకోవాలన్నారు. బాల్యవివాహాలు, భ్రూణహత్యలు వంటి దురాచారాలను అరికట్టాలన్నారు. ఆడపిల్లలను అన్ని రంగాల్లో ప్రోత్సహించాలని, అకృ త్యాలు, దాడులు, అన్యాయాలను ఎదుర్కొనేందుకు మహిళలు సమిష్టిగా పోరాటం

## మంత్రి తానేటి వనిత



చేయాల్సిన అవసరం ఉందన్నారు. ఉగాది నాటికి ప్రభుత్వం ప్రతిష్టాత్మకంగా చేపడుతున్న ఇళ్ళ పట్టాలు కూడా మహిళల పేరుతో అందించనున్నారు. అలాగే ఈ ప్రభు త్వంలో 13 మంది మహిళా శాసనసభ్యులు, ముగ్గురు మహిళా మంత్రులు ఉండడం పట్ల వైఎస్సార్‌సీపీ ప్రభుత్వం మహిళల పక్షపాతి అనటానికి నిదర్శనమన్నారు. ముఖ్యంగా మహిళలు చట్టాలపై అవగాహన పెంచుకుని సద్వినియోగం చేసుకోవాలన్నారు.





అంతర్జాతీయ మహిళా దినోత్సవ శుభాకాంక్షలు



'అంగన్‌వాడీ వాయిస్' సామాజిక ప్రజా చైతన్య మాసపత్రికకు
వార్షికోత్సవ శుభాకాంక్షలు

ఆపదలో ఉన్న ఆడపిల్లల రక్షణ సహాయ కొరకు
ఈక్రింది హెల్ప్‌లైన్ నంబర్లను సంప్రదించండి.












సిడిపివో మరియు సిబ్బంది
ఐసిడిఎస్ ప్రాజెక్టు, గణపవరం, ప॥గో॥ జిల్లా







'అంగన్‌వాడీ వాయిస్'
సామాజిక చైతన్య మాసపత్రిక
4వ వార్షికోత్సవ శుభాకాంక్షలు

పోతపాలు వద్దు...తల్లి పాలే ముద్దు




సి.డి.పి.ఓ మరియు సిబ్బంది
ఐసిడిఎస్ ప్రాజెక్టు,
గోపాలపురం, ప॥గో॥ జిల్లా





'అంగన్‌వాడీ వాయిస్'కి
4వ వార్షికోత్సవ శుభాకాంక్షలు




గర్భిణీ మరియు పుట్టబోయే శిశువు
అవసరాలను తీర్చడానికి గర్భావస్థ దశలో
పౌష్టికాహారం చాలా ముఖ్యం...

సి.డి.పి.ఓ మరియు సిబ్బంది
ఐ.సి.డి.ఎస్. ప్రాజెక్టు,
మొగల్తూరు, ప॥గో॥ జిల్లా




# ప్రగతిపథంలో నెల్లూరు జిల్లా మహిళా శిశు సంక్షేమ శాఖ





## 'అంతర్జాతీయ మహిళా దినోత్సవ శుభాకాంక్షలు

మహిళలు, బాలికలపై జరుగుతున్న అత్యాచారాలను, లైంగిక దాడులను అరికట్టేందుకు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం దిశ చట్టం అనే పేరుతో ఒక కొత్త చట్టాన్ని రూపొందించింది. ఈ బిల్లును హోంమంత్రి సుచరిత 2019, డిసెంబరు 13న అసెంబ్లీలో ప్రవేశపెట్టారు. ఈ దిశ చట్టాన్ని శాసనసభ ఏకగ్రీవంగా ఆమోదించింది. ఇండియన్ పీనల్ కోడ్ మరియు క్రిమినల్ ప్రొసీజర్ కోడ్‌లో సవరణలు చేయడం జరిగింది. దిశ చట్టం ప్రకారం అత్యాచారం జరిగిన 7 రోజుల్లో పోలీసు దర్యాప్తు పూర్తి చేసి 14 రోజుల్లో విచారణ పూర్తి చేసి శిక్ష విధించే విధంగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఈ చట్టాన్ని రూపొందించింది. అంటే మొత్తం 21 రోజుల్లో ఈ చట్ట ప్రకారం నేరం రుజువు అయిన నిందితుడికి జీవితఖైదు లేదా మరణశిక్ష విధిస్తారు. దిశ చట్టం మహిళలు, చిన్నారులపై జరిగే నేరాల విచారణకు ప్రతి జిల్లాకు అనగా 13 ఫాస్ట్ ట్రాక్ ప్రత్యేక కోర్టులు ఏర్పాటు పబ్లిక్ ప్రాసిక్యూటర్లను నియమించుకునేందుకు ఆమోదం తెలిపింది. ఈ కోర్టులు ప్రత్యేకంగా పోక్సో 2012 చట్టం కింద ఏర్పాటు చేయడం జరిగినది.

### దిశ చట్టం కార్యాచరణ ప్రణాళిక :

1. 7 పని దినములలో పోలీసు ఇన్వెస్టిగేషన్
2. 14 పని దినములలో న్యాయ విచారణ జరుపుట.
3. 21 పని దినములలో నిందితులకు శిక్ష విధింపు.




### దిశ సెంటర్ నందు బాధితులకు సేవలు :

1. వైద్య సహాయము మరియు వైద్యసేవలు
2. 0 (జీరో) ఎఫ్.ఐ.ఆర్.ను చేయుట.
3. కౌన్సిలింగ్ సేవలు
4. ప్యానల్ లాయర్స్ ద్వారా న్యాయ సహాయం.
5. తాత్కాలిక వసతి

**ప్రాజెక్టు డైరెక్టర్ మరియు సిబ్బంది**

**సిడిపివోలు, ఎసిడిపిఓలు సూపర్‌వైజర్లు, కార్యకర్తలు**

**పొట్టి శ్రీరాములు నెల్లూరు జిల్లా**

# దిశ చట్టం ఇతర రాష్ట్రాలకు ఆదర్శం

## మీట నొక్కితే అభయహస్తం అబలలకు రక్షణ కవచం

**(మేఘన ఉదయ్ ఎంఎస్‌సి, ప్రత్యేక ప్రతినిధి)**

మహిళలపై జరిగే నేరాలకు సంబంధించి దర్యాప్తు విచారణు 21 రోజుల్లోనే పూర్తి చేసి దోషులకు శిక్ష పడేలా చేసేందుకు రాష్ట్ర ప్రభుత్వం ఇటీవల ప్రవేశపెట్టిన 'దిశ' చట్టం మహిళల దిశను మార్చేసింది. అబలలకు అండగా, ఆపదలో ఉన్న యువతుల పాలిట వెన్నుదన్నుగా, కీచకులపాలిట యమ పాశంగా మారింది. అంతేకాక ఈ చట్టం ఇతర రాష్ట్రాలకు ఆదర్శంగా నిలిచింది అనటంలో ఎటువంటి సందేహంలేదు. దిశ బిల్లును ఇతర రాష్ట్రాల్లో ప్రవేశపెట్టడానికి ఆ రాష్ట్ర ప్రజా ప్రతినిధులు, ఉన్నత అధికారులు మొగ్గు చూపుతున్నారు. దానిలో భాగంగా ఇటీవల మహారాష్ట్ర హోంశాఖ మంత్రి అనిల్ దేశ్‌ముఖ్ ఈ చట్టాన్ని తమ రాష్ట్రంలో ప్రవేశపెడతామని వెల్లడించడమే కాక ఆయన నేతృత్వంలోని ప్రతినిధి బృందాన్ని దిశ చట్టంపై అధ్యయనానికి మన రాష్ట్రానికి పంపించారు. ఈ చట్టం నూత నంగా ప్రవేశపెట్టడంపై మన రాష్ట్ర ముఖ్యమంత్రి వైఎస్ జగన్మో హనరెడ్డి అభినందనీయులని ప్రశంసలు సైతం కురిపించారు. కేవలం దిశ చట్టాన్ని తీసుకురావటమేకాక చట్టాన్ని ప్రవేశపెట్టిన రెండు నెలల్లోనే దిశ పేరిట ప్రత్యేక పోలీసు స్టేషన్లు సైతం ప్రారంభిస్తున్నారు. దీనికోసం బడ్జెట్ కూడా కేటాయించటం అభినందనీయం. మహిళల భద్రత కోసం అన్ని చట్టాలు కంటే దిశ చట్టాన్ని కఠినంగా రూపొందించి అమల్లోకి తీసుకురావటం అభినందనీయమని పలువురు ప్రశంసిస్తున్నారు. ఆడపిల్లలపై పుట్టకముందే అమలవుతున్న వివక్ష వృద్ధాప్యం వరకు కూడా ఏదో రూపంలో కొనసాగుతుందని, ఈ విధానానికి స్వస్తి పలికేం దుకు రాష్ట్ర ముఖ్యమంత్రి ఈ చట్టాన్ని ప్రవేశపెట్టడం మహిళలకు తరతరాలకు తరగని సంతోషం అని చెప్పాలి. తల్లి కడుపులో పిండంగా రూపుదిద్దుకున్నప్పటినుంచే ఆడపిల్లది అస్తిత్వ పోరాటమే చేయాల్సి వస్తుంది. కనుక దిశ చట్టం అమలుతో కొంత మార్పు రావచ్చునేది ప్రభుత్వం అభిప్రాయం కాబట్టి ఇప్పుడున్న నిర్భయ, ఫోక్సో చట్టాలు కంటే ధీటుగా దిశ 2019 చట్టాన్ని తీసుకువచ్చారు. మహిళల భద్రత, స్వేచ్ఛ, సమానత్వం, ఆత్మగౌరవం పరిరక్షణే ధ్యేయంగా ఈ చట్టాన్ని తెరమీదికి తెచ్చారు. నేటి యాంత్రిక జీవన విధానంలో గాడి తప్పుతున్న కుటుంబవ్యవస్థ మానవీయ సంబంధాల్లో లోటుపాట్లు నేరా లకు ప్రధాన కారణమవు తున్నాయి. ఈ పరిస్థితుల్లో చట్టాలు



పదనుదేరితేనే తప్పు నేరాలు అదుపు లోకి రావని భావించి ఈ దిశ బిల్లును ఇంత పకడ్బందీగా ప్రవేశ పెట్టారు. ఈ చట్టం అమలుకు ప్రత్యేక పోలీసు స్టేషన్‌తోపాటు ప్రత్యేక కోర్టును ఏర్పాటు చేయటం శుభపరిణామమని ప్రతి మహిళా భావిస్తున్నారు. ఎప్పుడు ఏ ఆపద ముంచుకొస్తుందో అంటూ బిక్కుబిక్కు మంటూ కాలం గడిపే రోజుల్లో ఉన్న ఆడపిల్లలు, మహిళలు స్వేచ్ఛగా, ధైర్యంగా జీవించే మంచిరోజులు ఈ దిశ చట్టంతో వచ్చాయి. గతంలో ఎన్ని చట్టాలు వచ్చినా, ఆ చట్టాల్లో ఉన్న లొసుగులు నేరస్థులకు చుట్టాలుగా మారటంతో వారు శిక్షల నుండి తప్పించుకుని బయటపడేవారు. కాని ఇప్పుడు రాష్ట్ర ప్రభుత్వం దిశ చట్టాన్ని పకడ్బందీగా రూపొందించటంతో నేరస్థులకు సింహస్వప్నంగా మారింది. దానికితోడు ప్రత్యేకంగా మహిళల కోసం దిశ యాప్‌ను ప్రవేశపెట్టారు. ఆపదలో ఉన్న మహిళలను రక్షించేందుకు పోలీసుశాఖ అత్యంత సాంకేతిక పరిజ్ఞానంతో రూపొందించింది. దీనిలో జిపిఎస్ ట్రాకింగ్ విధానాన్ని రూపొందించారు. తమతమ ఆండ్రాయిడ్ ఫోన్‌లో గూగుల్ ప్లే స్టోర్‌లోకి వెళ్ళి అక్కడ దిశ యాప్‌ను డౌన్‌లోడ్ చేసుకోవచ్చు. ఈ యాప్ ఉంటే అతివలకు ఆనందదాయకమే అని చెప్పాలి. మహిళాశక్తి చాటేలా, మృగాళ్ళ గుండె అదిరేలా దిశ చట్టం స్త్రీ జాతికి భరోసా కానుంది. నేటితరం మహిళలు ఉన్నత చదువులతో కొత్త ఆలోచనలతో ముందుకు దూసుకుపోతు న్నారు. పురుషులకంటె ఏ రకంగానూ తక్కువ కాదని నిరూపించు కుంటున్నారు. ఈ పరిస్థితుల్లో వారి భద్రత అగమ్యగోచరంగా మారింది. యుగాలు మారినా తరాలు మారినా స్త్రీ పురుషుల మధ్య వివక్ష కొనసాగుతూనే ఉంది. పురుషులు స్త్రీ పట్ల అహం కారంతోనే ప్రవర్తిస్తున్నాడు. ఈ పరిస్థితుల్లో ఈ చట్టం మహిళల పాలిట వరంగా మారింది. ముఖ్యమంత్రి దిశ చట్టం అమలు కోసం ప్రత్యేక శ్రద్ధ తీసుకున్నారు. దానికోసం ప్రత్యేకంగా ఐపి ఎస్, ఐఎఎస్ అధికారులను సైతం నియమించారు. మహిళలకు సముచిత భాగస్వామ్యం కల్పించినప్పుడే సామాజిక ప్రగతి త్వరితగతిన సాధ్యపడుతుందనే మహాత్మాగాంధీ ఆశయాన్ని ఈ చట్టంతో నిజం చేద్దాం.

# కిశోరి బాలల సాధికారత దిశగా ముందడుగు

## సత్ఫలితాలనిస్తున్న వైఎస్ఆర్ కిశోరి వికాసం ★ ఆకట్టుకుంటున్న శిక్షణ అంశాలు

ప్రతి తల్లి తన కూతుర్ని బంగారు తల్లిలాగే భావిస్తుంది. పిలుచుకుంటుంది కూడా. కానీ లేడిపిల్లల్ని వేటాడే పులులున్న మన సమాజంలో ఎన్ని పసిమొగ్గలు నేలరాతున్నాయో చూస్తుంటే మనం ఆడపిల్లల్ని బయటకు పంపటానికే భయపడే రోజుల్లో ఉన్నాము. ముఖ్యంగా కౌమారప్రాయంలో ఉండే బాలికలు తమను తాము కాపాడుకునే విధంగా మహిళా శిశు సంక్షేమశాఖ ఆధ్వర్యంలో 2017లో ప్రారంభించిన కిశోరి వికాసం పథకం సత్ఫలితాలనిస్తుంది అనటంలో అతిశయోక్తి లేదు. ఈ పథకం ద్వారా రాష్ట్రవ్యాప్తంగా లక్షలాదిమంది కిశోరి బాలలకు బాల్య వివాహాలు, బాలల అక్రమ రవాణా, బాలలపై అత్యాచారం, రక్తహీనత, పోషకాహారలోపం, ఆడపిల్లల్లో ఋతుక్రమ పరిశు భ్రత, మహిళలు మరియు బాలల సంక్షేమ పథకాలు, ఉమెన్ హెల్ప్‌లైన్, వన్‌స్టాప్ సెంటర్, మహిళా మిత్ర, సైబర్ మిత్రలాంటి అంశాలపై అత్యుత్తమ శిక్షణనిస్తున్నారు. జీవననైపుణ్యాలు నేర్పిస్తున్నారు. ఎన్నో లక్షల మంది బాలలకు మేలు చేకూర్చే ఈ బృహత్ పథకం గత మూడేళ్ళ నుండి నిరంతరాయంగా కొనసాగడం విశేషం. యునిసెఫ్, కొన్ని స్వచ్ఛంద సంస్థలతో కలిసి మహిళా శిశు సంక్షేమశాఖ ఈ బాలల సాధికారత కార్య క్రమం నిర్వహించటం అభినందనీయమని పలువురు ఆనందం వ్యక్తం చేస్తున్నారు. మనిషి జీవితంలో అత్యంత ముఖ్యమైన దశ కౌమారప్రాయం. బాలలు తమ బాల్యం నుంచి యవ్వనం లోకి అడుగుపెట్టే దశ ఇది. అంటే యవ్వనానికి ముందు దశ పది నుంచి 18 సంవత్సరాల వయస్సు కాలమిది. ఈ దశలోని పిల్లల్లో అనేక రకాల శారీరక, మానసిక, ఉద్వేగభరితమైన మార్పులు చోటు చేసుకుంటాయి. ఈ వయస్సు బాలలు పరిపూర్ణ బాలలుగా ఎదగటానికి అవసరమైన తోడ్పాటు వారికి అందించా లని భావించి ఈ విస్తృత కార్యక్రమాన్ని అమలు చేస్తున్నారు. బాలికలు విద్య, సామాజిక, సాంకేతిక, ఇతర అన్ని రంగాల్లో అభివృద్ధి సాధించేదిశగా అవగాహన కల్పిస్తున్నారు. అన్ని శాఖల సమన్వయంతో బాలికల సంరక్షణ కోసం ప్రత్యేక కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు. బాలికలు భవిష్యత్తు బాగుండి వారు బలంగా ఎదిగితేనే ఆరోగ్యవంతమైన సమాజం ఏర్పడుతోందని ఆలో చనతో ఎన్నో రకాల అవగాహన కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు. వీరికోసం ప్రత్యేకంగా టోల్‌ఫ్రీ నెంబరు కూడా ఏర్పాటు చేశారు.



ముఖ్యంగా కిశోరి బాలికల ఆరోగ్య అభివృద్ధి కొరకు బాటలు వేస్తున్నారు. ఆడపిల్లల్ని కనటానికే భయపడుతున్న నేటి దినాల్లో ఇలాంటి కార్యక్రమం ద్వారా చాలామందికి అవగాహన కల్గడం విశేషం. బాలల హక్కుల కోసం వచ్చిన చట్టాలుపైన వారికి చెందాల్సిన హక్కులుపైన వారికి అవగాహన కల్గిస్తున్నారు. బాలికల విద్యను ప్రోత్సహించే విధంగా గ్రామీణ ప్రాంతాల్లో ఈ కిశోరి వికాసం శిక్షణలు నిర్వహించటం మూలంగా వారిలో అవగాహన కలిగి తమ తమ బిడ్డలను చదువుకునే విధంగా ప్రోత్సహించటం శుభపరిణామం. అభంశుభం తెలియని చిన్నా రులపై జరిగే ఎన్నో రకాల లైంగిక దాడులనుండి తప్పించుకుం టానికి ఇలాంటి అవగాహన సదస్సులు ఎంతగానో ఉప యుక్తంగా ఉంటాయి. అయితే సమాజంలో నేటికి ఆచారాలు, సాంప్రదాయాలు పేరుతో కొనసాగుతున్న అనేక పెడధోరణులు బాలికలపట్ల శాపంగా మారాయి. చాలా కుటుంబాల్లో కూడా సరైన అవగాహన లేకపోవటం, ఆర్థిక కారణాలు, సామాజిక ఒత్తిళ్ళు, వ్యవస్థలో లోపాలు వంటి రకరకాల కారణాలు బాలికల సంపూర్ణ ఎదుగుదలకు అడ్డంకిగా మారుతున్నాయి కాబట్టి వాళ్ళ సంపూర్ణ ఎదుగుదలకి ప్రభుత్వంతోపాటు సమాజం కూడా బాధ్యత వహించాలి. అప్పుడే తర్వాత తరానికి వీళ్ళంతా పునాదు లవుతారు. ప్రతిరోజు ఎక్కడో ఓచోట కిశోరి వికాసం అవగాహన కార్యక్రమాలు జరుగుతూనే ఉన్నాయి. ఫేజ్-1, ఫేజ్-2, ఫేజ్-3 స్థాయిల్లో అవగాహన శిక్షణను ఇస్తున్నారు. వీరి హక్కులు కోసం ఎన్నో సంస్థలు క్షేత్రస్థాయిలో పనిచేసి మంచి ఫలితాలు పొందు తున్నారు. మహిళా శిశు సంక్షేమశాఖలో అన్ని కార్యక్రమాలు కంటే దీటుగా ఈ కిశోరి వికాసం అమలు కావటం చెప్పుకోదగ్గ అంశమని మేధావులు సైతం అభివర్ణిస్తున్నారు.

# హింసకు సంకెళ్లేద్దాం!

మహిళలకు స్వేచ్ఛ పెరిగింది... వారి కీర్తి నింగికెగిసి పోతోంది...ఉన్నత అవకాశాలు వెల్లువలా వస్తున్నాయి. గాజు తెరలు బద్దలు కొట్టి దూసుకుపోతున్నారు...అంటూ ఎన్నో వింటున్నాం. అదంతా నాణానికి ఒకవైపే. మరోవైపు అతివ ఎంత ఎత్తుకి ఎదిగినా...వివక్ష, అసహనం అన్నిచోట్లా కనిపిస్తూనే ఉన్నాయి. మగవారికి దీటుగా పోటీ ప్రపంచంలో నిలబడుతున్నా...ఎక్కడో ఒకచోట నిత్యం హింసకు గురవుతూనే ఉంది. అసలు ఎందుకీ హింస...దాన్ని ఎలా ఎదుర్కోవాలి?

ఎక్కడ స్త్రీలు పూజలందుకుంటారో అక్కడ దేవతలు కొలువై ఉంటారు అన్న ఆర్యోక్తిని గొప్పగా చెప్పుకుంటాం. కానీ దానికి భిన్నంగా మహిళలపై లైంగికదాడులు, దౌర్జన్యాలు వంటివి రోజు రోజుకీ పెరిగిపోతున్నాయి. హింస ఏ రూపంలో ఉన్నా... మానవ హక్కుల ఉల్లంఘన కిందకే వస్తుందని అంటోంది ఐక్యరాజ్యసమితి. ఈ సంస్థ అభిప్రాయం ప్రకారం మహిళలపై హింస అంటే భౌతిక, మానసిక, లైంగిక వేధింపులు, స్త్రీల వ్యక్తిగత, ప్రజా జీవితానికి భంగం కలిగించే ప్రవర్తన. వాటిల్లో లింగనిర్ధారణ పరీక్షలు, భ్రూణహత్యలు మొదలు...పెంపకంలో వ్యత్యాసం చూపించడం, అవకాశాల్లో అసమానతలు, బాల్యవివాహాలు, అక్రమ తరలింపు, బలవంతపు పెళ్ళిళ్ళు, వరకట్న వేధింపులు... ఇలా ఎన్నో ఉంటాయి. దీంతో ఆరోగ్యపరంగా పునరుత్పత్తి సామర్థ్యం తగ్గడం, హెచ్ఐవి వంటి వ్యాధుల బారినపడే ప్రమాదమూ ఉంది. కుంగుబాటికీ గురవ్వొచ్చు. ప్రాణపాయమూ ఎక్కువే. ఈ పరిస్థితికి అడ్డుకట్ట వేసి మహిళల్లో చైతన్యం తీసుకువచ్చేందుకు ఐక్యరాజ్యసమితి నడుం బిగించింది. స్త్రీల భద్రత, స్వేచ్ఛ, సమానత్వం, ఆత్మగౌరవ పరిరక్షణే లక్ష్యంగా ఏటా నవంబర్ 25న ప్రపంచవ్యాప్తంగా స్త్రీలపై హింసా నిరోధక దినోత్సవంగా జరుపుకోవాలని నిర్ణయించింది.

**బాధితులెవరు? కారణాలు ఏంటి?**

మన చుట్టూ ఉన్న అక్క, చెల్లి, అమ్మ ....ఇలా ప్రతి ఒక్కరూ బాధితులే. వీరి జీవితకాలంలో ఏదో ఒక సందర్భంలో ఆ బాధను అనుభవించిన వారే. నిరక్షరాస్యత, కుటుంబ పరిస్థితులు, ప్రేమ, పెళ్ళి, ఉపాధి వంటివి ఈ హింస బారిన పడేలా చేస్తున్నాయి. పురుషాధిక్యత, మాధ్యమాలు, పోర్నోగ్రఫీ, మద్యపానం, మాదకద్రవ్యాలు, పేదరికం, ఆడపిల్లల నిస్సహాయత వంటివి వీరిపై హింసను ప్రేరేపిస్తున్నాయి. ఈ సమస్యలకు



ఆర్థికపరమైన ఒత్తిళ్ళు తోడవుతున్నాయి. అభివృద్ధి పరిణమాలు, జీవనశైలిలో మార్పులు...మరికొంత ప్రభావం చూపుతున్నాయి.

**పరిష్కారం ఎలా?**

నిజానికి ఈ సమస్యల్ని కేవలం మహిళల సమస్యగా మాత్రమే అనుకోవద్దు. సామాజిక రుగ్మతగా భావించాల్సిన అవసరం ఉంది. ఈ ఘటనల్లో చాలావరకూ భాగస్వామి, తెలిసినవారే ఈ తరహా వికృత చేష్టలకు పాల్పడుతున్నారు. ఈ హింసబారి నుంచి మహిళలు బయటపడాలంటే..మార్పు సామాజికంగా జరగాలి. ఆ అడుగులు మొదట మన ఇంటి నుంచే మొదలవ్వాలి. మహిళల్లో ఆత్మవిశ్వాసం పెరగాలి. ఆత్మ రక్షణ విద్యలూ అలవర్చుకోవాలి. ప్రతి తల్లి ఆడపిల్లకు జాగ్రత్తలు చెప్పడంతోపాటు అబ్బాయిల దృక్పథాల్లోనూ మార్పు తీసుకు రావాలి. చదువు అందించే విజ్ఞానంతోపాటు సంస్కారం వారికి అలవడేలా చూడాలి. ఇప్పటికే అనేక స్వచ్ఛంద సంస్థలు ఈ దిశగా పనిచేస్తున్నాయి. అలాంటివాటిల్లో పూణెకి చెందిన ఈక్వల్ కమ్యూనిటీ ఫౌండేషన్ ఒకటి. టీనేజీ అబ్బాయిల ఆలోచనా విధానాన్ని మార్చడం ద్వారా మహిళలపై హింసను అరికట్టాలనుకుంటోంది ఈ సంస్థ. యాక్షన్ ఫర్ ఈక్వాలిటీ పేరుతో వేలాదిమంది మగపిల్లలకు అవగాహన కల్పిస్తోంది. ఇంట్లో తమ తల్లి, చెల్లితో గౌరవంగా ఎలా మాట్లాడాలి. ఇంటి పనుల్లో సాయం చేయాల్సిన అవసరం వంటివి చెబుతోంది. ఇక, మహిళలు వేధింపుల బారిన పడకుండా, బాధితులు త్వరగా బయటపడేలా ఎన్నో స్వచ్ఛంద సంస్థలు సాయం చేస్తున్నాయి. ప్రభుత్వం చట్టపరమైన రక్షణా కల్పిస్తోంది.

**చట్టం ఏం చెబుతోంది?**

మహిళలపై హింసను అరికట్టేందుకు కఠినమైన చట్టాలు

కావాలి. వాటి అమలు పక్కాగా సాగాలి. అలాంటి వాటిల్లో గృహహింస చట్టం-2005 ఒకటి. ఇది వివాహబంధంలో వుండి హింసకు గురవుతున్న మహిళలకు వర్తిస్తుంది. అధిక కట్నం, పుట్టింటి ఆస్తిలో భాగం, విలాసాలకు డబ్బు తీసుకురావాలని అడగడం, వివాహేతర సంబంధాలతో చిత్రవధకు గురిచేయడం వంటివి నేరాలుగా పరిగణిస్తారు. నేర నిరూపణ అయితే ఒక సంవత్సర జైలు శిక్ష, 20 వేల రూపాయల జరిమానా విధిస్తారు.

రెండోది నేర సంబంధిత న్యాయసవరణ చట్టం-2013 ఆమ్లదాడులు, లైంగిక వేధింపులు, అత్యాచారం వంటివన్నీ నేరాలుగా పరిగణిస్తారు. సెక్షన్ 354(ఎ) కింద లైంగిక హింస, దౌర్జన్యం, అశ్లీల చిత్రాల ప్రదర్శన....వంటివాటికి మూడ నుంచి ఐదేళ్ళ వరకు శిక్ష పడే అవకాశం ఉంది. పనిచేసే చోట లైంగిక వేధింపుల నిరోధక చట్టం, సెక్స్‌వర్కర్ల చట్టం, స్త్రీల అసభ్య చిత్ర నిషేధచట్టం 1986, మానవ అక్రమ రవాణా నియంత్రణ చట్టం వంటివెన్నో మహిళలకు అండగా ఉన్నాయి.

## స్త్రీ సమస్యలపై పోరాడే స్వచ్ఛంద సంస్థల్లో కొన్ని ఇవి...

బాలికల అక్రమ రవాణీ, విదేశీ పెళ్ళిళ్ళ పేరుతో అమ్మాయిల తరలింపుల్ని సమర్థంగా అడ్డుకుంటోంది. హైదరాబాద్‌కి చెందిన షాహీన్ సంస్థ(040 24386994). బాల్య వివాహాలు, వరకట్న వేధింపులు, గృహహింస...బాధిత మహిళలకు సరైన పరిష్కారం చూపిస్తుంది తెలుగురాష్ట్రాలకు చెందిన భూమిక సంస్థ. (హెల్ప్ లైన్‌నెంబర్ 1800425908). మానవ అక్రమరవాణా,దాడులు, వ్యభిచారం వంటి వాటికి బలైన ఆడపిల్లల సంరక్షణకోసం పనిచేస్తోంది. హైదరాబాద్‌కి చెందిన ప్రజ్వల సంస్థ బాధితులకు అన్నివేళల సాయంగా ఉండే ఈ సంస్థ ఫోన్ నెంబర్ 84142 37304. భాగస్వామి నుంచి శారీరక, మానసిక వేధింపులూ, కట్నం కోసం అత్తింటి వారు పెట్టే చిత్రహింసలు.. సమస్యలు ఏదైనా మహిళలకు అండగా నిలబడుతున్నాయి రెండు తెలుగు రాష్ట్రాల్లోని మహిళా శిశు సంక్షేమ విభాగాలు. ప్రతి జిల్లాలో ఉన్న ఆ సంస్థ కేంద్రాల్ని సంప్రదించి సాయం కోరవచ్చు.









# స్త్రీ-పురుష సమానత్వంతోనే రుగ్మతల నివారణ

## మార్పుకోసం తెగువ చూపండి



*(ప్రపంచ మహిళా దినోత్సవం సందర్భంగా ప్రత్యేక వ్యాసం)*

మహిళా దినోత్సవంనాడు మహిళా ప్రాధాన్యం గురించి, వారి సాధికారత గురించి, ప్రపంచవ్యాప్తంగా ఎన్నో సదస్సులు, సమావేశాలు, అవగాహన కార్యక్రమాలు, వాక్‌థాన్‌లు. మారథాన్‌లు.... అకాశంలో సగం అంటూ మహిళా లోకాన్ని ఆకాశానికి ఎత్తే ఉపన్యాసాలు, కానీ వాస్తవానికి మహిళలు పురుషాధిక్య ప్రపంచంలో రాణించలేకపోతున్న పరిస్థితులు, తంద్రచాటు బిడ్డగానో లేదా భర్త మాట జవదాటని భార్యలే అధికం మరి. మహిళాలోకం సంపూర్ణ సాధికారత సాధించాలంటే తమ కాళ్ళపై తాము నిలబడి భవిష్యత్తు తరాలకు మార్గదర్శకంగా మారాలంటే ముక్తకంఠంతో వినిపించే సమాధానం విద్యావకాశాలు కల్పించటమే. మార్పుకోసం తెగువ చూపించాల్సిందే. ఎన్నో మహిళా దినోత్సవాలు జరుపుకుంటున్నాం. ఎన్నెన్నో ఉపన్యాసాలు వింటున్నాం. అయినా మహిళల స్థితి గతుల్లో మార్పు సంపూర్ణంగా రాలేదని చెప్పాలి. 1910 సంవత్సరమునకు ముందు మహిళల పరిస్థితి చాలా దుర్భరంగా ఉండేది. మానవహక్కులు అణిచి వేయబడ్డాయి. దేశవ్యాప్తంగా మహిళలు రక్షణ, భద్రత కోల్పోయారు. ఆటవిక స్వభావం అవధులు దాటింది. ఒకవంక బహుభార్యత్వం, బాల్యవివాహాలు సర్వసాధారణంగా జరిగేవి. స్త్రీకి విద్య, ఉద్యోగం, ఆస్తి హక్కు లేదు. వితంతు వివాహాలు, విడాకులు అయితే చెప్పనవసరం లేదు. ఈ నిపేధ్యంలో మహిళలు అంతా ఏకమై అన్యాయానికి, అక్రమానికి తలవంచకూడదనే నిర్ణయానికి వచ్చి డెన్మార్క్‌లోని తొలి సదస్సు జరిపారు. 1910 సంవత్సరంలో అనగా 110 ఏళ్ళ క్రితం మొట్టమొదటిసారిగా జరిగిన అంతర్జాతీయ మహిళా దినోత్సవం ఇది. డెన్మార్క్ రాజధాని కోపెన్‌హాగన్‌లో మార్చి 8న జరిగిన ఈ తొలి సమావేశంలోనే ప్రతి ఏడాది మహిళా దినోత్సవాన్ని జరుపుకోవాలని ప్రపంచ ప్రఖ్యాత మహిళా నాయకురాలు కార్లో జట్కిన్ పిలుపునిచ్చారు. దీనితో మహిళా లోకం ప్రతిధ్వనించింది. కాగా ఇన్నేళ్ళ నుండి ఈ వేడుకలు అనగా మహిళా దినోత్సవాలు జరుపుకున్నప్పటికి కొన్ని మహిళా సమస్యలు అపరిష్కృతంగానే ఉన్నాయి. విద్య, అనారోగ్యం, అత్యాచారాలు, హత్యలు, వివక్ష, భ్రూణహత్యలు వరకట్నం ఇవన్నీ మహిళాభివృద్ధికి గ్రహణాలే. ఇవన్నీ రూపుమాపుకోవాలంటే మహిళల్లో చైతన్యం ఇంకా రావాలి. వారి హక్కులు బాధ్యతలు గూర్చి తెలుసుకోవాలి. మన నిత్య జీవితంలో చట్టం చాలా ప్రధాన పాత్ర పోషిస్తుంది కాబట్టి ప్రతి వ్యక్తి తన న్యాయపరమైన ప్రాథమిక హక్కులను, అధికారాలను తెలుసుకోవాలి. దేశ జనాభాలో స్త్రీలు సగభాగం అంతేకాదు ప్రధానంగా ప్రతి కుటుంబానికి స్త్రీ పునాది కాబట్టి వారికి సంబంధించిన ప్రాథమిక హక్కులు న్యాయపరమైన విషయాలపట్ల జాగృతితోపాటు స్పృహను కలిగి ఉండాలి. అప్పుడే స్వేచ్ఛ సమానత్వం లభిస్తుంది. మన హక్కులు మనమే సాధించుకోవాలి. అప్పుడే సమానత్వం ఏర్పడుతుంది.


**FORM IV**

(See Rule 8)

Statement about ownership and other particulars of the Anganvadi Voice Telugu Montnly.

| | | |
|---|---|---|
| 1. Place of Publication | : | Eluru<br>West Godavari District<br>Andhra Pradesh |
| 2. Periodicity of the publication | : | Monthly |
| 3. Printer's Name | : | M. Prasantha Raju |
| Nationality | : | Indian |
| Address | : | D.No. 23A-6-7,<br>Sankaramatham Road,<br>R.R. Peta, ELURU - 534 002 |
| 4. Publisher's Name | : | D. Udaya Bhaskara Rao |
| Nationality | : | Indian |
| Address | : | D.No.3B2-51,<br>Western Street<br>ELURU- 534 001<br>W.G.Dist., A.P. |
| 5. Editor's Name | : | D. Udaya Bhaskara Rao |
| Nationality | : | Indian |
| Address | : | D.No.3B2-51, Western Street<br>ELURU- 534 001<br>W.G.Dist., A.P. |
| 6. Owner's Name | : | D. Udaya Bhaskara Rao |
| Nationality | : | Indian |
| Address | : | D.No.3B2-51,<br>Western Street<br>ELURU- 534 001<br>W.G.Dist., A.P. |

Sd/-

Place : Eluru **(D. UDAYA BHASKARARAO)**

Date : 01-03-2020 Publisher

# మహిళ పాత్ర కీలకం - మహిళలు లేనిదే సమాజం లేదు

## - కర్నూలు జిల్లా కలెక్టర్ వీరపాండ్యన్

మహిళలు లేనిదే సమాజం లేదని, నేటి సమాజంలో మహిళల పాత్ర కీలకమని కలెక్టర్ వీరపాండ్యన్ పేర్కొన్నారు. కలెక్టరేట్ సునయన ఆడిటోరియంలో అంతర్జాతీయ మహిళా దినోత్సవం నిర్వహించారు. కార్యక్రమంలో కలెక్టర్ సతీమణి ఆండాళ్, డిఆర్వో పుల్లయ్య సతీమణి మాధవి, ఐసిడిఎస్ పిడి భాగ్యరేఖ, ఎపిడి విజయ, ఎపి జెఎసి అమరావతి మహిళా విభాగం రాష్ట్ర అధ్యక్షురాలు బి సుశీల, రాష్ట్ర ఉపాధ్యక్షురాలు ఝాన్సీ, జిల్లా అధ్యక్షురాలు నాగమణి, సెక్రటరీ విజయభారతి, ప్రభుత్వ మహిళా ఉద్యోగుల సంఘం జిల్లా అధ్యక్షురాలు సరస్వతి జ్యోతి ప్రజ్వలన చేశారు. ఆరేళ్లలోపు చిన్నారుల్లో రక్తహీనతను పోగొట్టేందుకు ఐసిడిఎస్ అమలు చేస్తున్న 'పోషణ అభియాన్ – ఇంటింటా పోషణ సంబరాలు' పోస్టర్లను, కరపత్రాలను కలెక్టర్ ఆవిష్కరించారు. అనంతరం కలెక్టర్ మహిళలకు శుభాకాంక్షలు తెలిపారు. ప్రతిరోజు మహిళలు చేస్తున్న పనులను గుర్తు తెచ్చు కొని వారిని గౌరవించాలని అన్నారు. మహిళలు అన్ని రంగాలలో రాణించేందుకు ప్రతి ఒక్కరూ సహకరించాలని కోరారు. జిల్లాలో మహిళల సమస్యలు చాలా ఉన్నాయని, వారి కోసం అభివృద్ధి, సంక్షేమ కార్యక్రమాలను అమలు చేయాల్సిన అవసరం ఉందని అన్నారు. జిల్లాలో విద్య, వైద్య రంగం బాధాకర పరిస్థితుల్లో ఉందని అభిప్రాయపడ్డారు. అక్షరాస్యతను పెంచుకోవాల్సిన అవ సరం ఉందని, ప్రధానంగా మహిళల అక్షరాస్యతలో జిల్లా వెనుక బడి ఉందని అన్నారు. ఎస్టి మహిళల్లో అక్షరాస్యత చాలా తక్కువ ఉందని అన్నారు. జిల్లాలో మహిళల కోసం ప్రభుత్వం తరపున చాలా కార్యక్రమాలు చేపడుతున్నామని, పోషణ్ పక్వాడా కార్యక్రమాన్ని ప్రారంభించామని తెలిపారు. ప్రధానమంత్రి



మాతృవందన యోజన, డిఆర్డిఎ, మెప్మా తరపున పిల్లలను చదివించడంలో మహిళలు కీలకపాత్ర పోషించాలని అన్నారు. ఆడపిల్లల చదువు ఇంటికి వెలుగు అని అన్నారు. విద్యలో రాణిస్తే మంచి ఉపాధి లభిస్తుందని, జీవనం సుఖమయం అవు తుందని అన్నారు. పేద పిల్లలను దృష్టిలో ఉంచుకొని రాష్ట్ర ప్రభుత్వం అమ్మఒడి పథకం ప్రవేశపెట్టిందన్నారు. కలెక్టరేట్‌లో మహిళలకు మెరుగైన వసతుల కోసం మాస్టర్ ప్లాన్ తయారు చేస్తున్నామని తెలిపారు. అనంతరం కలెక్టర్ సతీమణి ఆండాళ్ మాట్లాడుతూ స్త్రీగా పుట్టడం ఒక వరం అని అన్నారు. మంచి ప్రవర్తన, ఒకరికి మంచి చేయాలనే తపన మహిళలకు ఉండాలని అన్నారు. మన కోసం ఎల్లప్పుడూ తపన పడే వ్యక్తి తల్లి అని, తల్లి కష్టం మరువలేనిదని అన్నారు. పురుషులు ప్రతి మహిళలో తన తల్లిని, సోదరిని చూసుకోవాలని కోరారు. అదేవిధంగా మహిళలు పురుషులను గౌరవించాలని అన్నారు. అనంతరం సాంస్కృతిక కార్యక్రమాలు, ఆటల పోటీల విజేతలకు బహుమతు లను అందజేశారు. కార్యక్రమంలో మహిళా ఉద్యోగులు, మహిళలు, అధికారులు పాల్గొన్నారు.

### గమనిక

ప్రతి నెల ఎంతో కష్టపడి మన శాఖకి సంబంధించి 13 జిల్లాల సమాచారాన్ని ఎప్పటికప్పుడు అందిస్తూ క్రమం తప్పకుండా రాష్ట్రవ్యాప్తంగా ఉన్న 13 జిల్లాల్లోని సిడిపిఒలకు పత్రిక పంపిస్తున్నాము. అయితే కొంతమంది సిడిపిఒలకు పత్రిక రావటంలేదని, ఒక్కో నెల వస్తుంది అని అప్పుడెప్పుడో వచ్చింది ఇప్పుడు రావటం లేదు అని చెబుతున్నారు. పత్రిక ప్రతినెల పంపిస్తున్నాము కాబట్టి దయచేసి మీ పోస్ట్‌మ్యాన్‌ని అడగండి లేదా మీమీ కార్యాలయాల చిరునామాలు మారితే **94401 41712** నెంబరుకు మారిన అడ్రస్ వాట్సాప్‌కు పంపండి.

ఎడిటర్ : అంగన్‌వాడీ వాయిస్



# అంతర్జాతీయ
# మహిళా దినోత్సవ శుభాకాంక్షలు

'అంగన్‌వాడీ వాయిస్' సామాజిక ప్రజా చైతన్య మాసపత్రికకు

4వ వార్షికోత్సవ శుభాకాంక్షలు







ప్రజలను మేల్కొల్పడానికి ముందుగా మేల్కొనవలసింది స్త్రీ.
ఒక్కసారి ఆమె కదిలితే కుటుంబం కదులుతుంది. దేశం కదులుతుంది.



## సి.డి.పి.ఓ మరియు సిబ్బంది
## ఐసిడిఎస్ ప్రాజెక్టు, తెనాలి, గుంటూరు జిల్లా





# 'అంతర్జాతీయ మహిళా దినోత్సవ శుభాకాంక్షలు






'అంగన్‌వాడీ వాయిస్'కి

4వ వార్షికోత్సవ శుభాకాంక్షలు



బిడ్డ పుట్టిన గంటలోపే ముర్రిపాలు త్రాగించాలి...
శిశువుకు అత్యుత్తమ ఆహారం తల్లిపాలు



## సి.డి.పి.ఓ మరియు సిబ్బంది
## ఐసిడిఎస్ ప్రాజెక్టు, నాదెండ్ల, గుంటూరు జిల్లా






# అంతర్జాతీయ
# మహిళా దినోత్సవ శుభాకాంక్షలు





"అంగన్‌వాడీ వాయిస్"

సామాజిక ప్రజా చైతన్య మాసపత్రికకు

4వ వార్షికోత్సవ శుభాకాంక్షలు...

బిడ్డ సహజ ఎదుగుదల మరియు వికాసం కోసం అయోడిన్ ఉన్న ఉప్పునే వాడాలి...



## సి.డి.పి.ఓ మరియు సిబ్బంది
## ఐసిడిఎస్ ప్రాజెక్టు, 75 త్యాళ్ళూరు, గుంటూరు జిల్లా




‘అంగన్‌వాడీ వాయిస్’కి
వార్షికోత్సవ శుభాకాంక్షలు




నిజాలను నిర్భయంగా తెలియపరుస్తూ పత్రిక ప్రారంభించిన
అనతికాలంలోనే విశేష పాఠకాభిమానం పొందిన “అంగన్‌వాడీ వాయిస్”
సామాజిక ప్రజాచైతన్య మాస పత్రిక నాలుగు వసంతాలు పూర్తి చేసుకుని
5వ వసంతంలోకి అడుగిడుతున్న శుభ తరుణాన శుభాకాంక్షలు...

**సి.డి.పి.ఒ మరియు సిబ్బంది**

**ఐసిడిఎస్ ప్రాజెక్టు, మైలవరం, కృష్ణా జిల్లా**




‘అంగన్‌వాడీ వాయిస్’కి
4వ వార్షికోత్సవ శుభాకాంక్షలు




మహిళా శిశు సంక్షేమ శాఖలో ప్రగతిని ఎప్పటికప్పుడు
అందరికీ తెలియపరుస్తూ దినదినాభివృద్ధి చెందుతున్న
“అంగన్‌వాడీ వాయిస్” సామాజిక ప్రజా చైతన్య మాసపత్రికకు
వార్షికోత్సవ శుభాకాంక్షలు...

**చైల్డ్ డవలప్‌మెంట్ ప్రాజెక్టు ఆఫీసర్ మరియు సిబ్బంది**

**ఐసిడిఎస్ ప్రాజెక్టు, విసన్నపేట, కృష్ణా జిల్లా**




‘అంగన్‌వాడీ వాయిస్’కి
4వ వార్షికోత్సవ శుభాకాంక్షలు




స్వరం మీది పోరాటం మాది అనే నినాదంతో ప్రతినెలా
క్రమం తప్పకుండా వెలువడుతున్న “అంగన్‌వాడీ వాయిస్”
సామాజిక ప్రజా చైతన్య మాసపత్రికకు 4వ వార్షికోత్సవ శుభాకాంక్షలు...

**సి.డి.పి.ఒ మరియు సిబ్బంది**

**ఐసిడిఎస్ ప్రాజెక్టు, తిరువూరు, కృష్ణా జిల్లా**

# ఏ వయసుకా పోషకం

ఇరవైల్లో ఆమె గలగలాపారే సెలయేరు. వయసు పెరుగుతున్న కొద్దీ ఆమెలోని చురుకుదనం, శక్తి క్రమంగా తగ్గుతాయి. యాభై, అరవైలకు వచ్చేసరికి నిశ్శబ్ద నదిలా మారుతుంది. ఈ క్రమంలో వచ్చే మార్పులకనుగుణంగా ఎలాంటి ఆహార పదార్థాలను తీసుకోవాలి? వాటి నుంచి అందే పోషకాలు ఏమిటో తెలుసుకుందామా....

## 20-30లలో...

ఈ వయసు మహిళలు తమ శరీరతత్వం, ఆకలినిబట్టి ఆహారం తీసుకోవాలి. ఎక్కువేం తినక్కర్లేదు. తీసుకునే ఆహారంలో విటమిన్లు, మినరళ్లు మెండుగా ఉండేలా చూసుకోవాలి. ఈ వయసులోనే జంక్ ఫుడ్ ఎక్కువగా తీసుకుంటారు. కానీ వద్దు... బదులుగా తాజా పండ్లు, కాయగూరలు ఎంచుకోండి. తృణ ధాన్యాలతో చేసిన చిరుతిళ్ళు, ఎండుఫలాలు, పొద్దుతిరుగుడు గింజలు, క్యారెట్లు, పాలు అన్నీ అవసరమే. వీటిలోని యాంటీ ఆక్సిడెంట్లు ఆరోగ్యాన్నిస్తాయి. చర్మ సంబంధ సమస్యలు రావు. ఈ వయసులో హార్మోన్ల సమస్యలూ సహజమే. చాలామంది యువతుల్లో రక్తహీనత ఎదురవుతుంది. దాన్ని తగ్గించుకునేందుకు ఫోలిక్ యాసిడ్, ఇనుము విటమిన్ బి12 ఉండే పదార్థాలను తరచూ తీసుకోవాలి. బరువు పెరుగుతున్నామని అనిపిస్తే తగిన వ్యాయామం ఎంచుకుంటే సరిపోతుంది. ఉదయం అల్పాహారం తప్పనిసరి. ఇందులో ఇష్టమైన పోషకాలున్న పదార్థాలను ఎంచుకోవచ్చు. దాంతోపాటు రెండుపూటలా భోజనం, మధ్యలో పండ్లు, కూరగాయలు కలిపి రోజులో ఐదుసార్లు తినాలి. రెండు పండ్లు, మూడు రకాల కూరగాయలు రోజువారీ ఆహారంలో ఉండేలా చూసుకోవాలి. గర్భం దాల్చాలనుకునేవారు ఫోలిక్ యాసిడ్ అందేలా ఆకుకూరలు, నారింజ, బీట్‌రూట్, బీన్స్ లాంటివి ఎక్కువగా తీసుకోవాలి.

ఎలాంటి పదార్థాలంటే...ఆవిరిపై ఉడికించిన పదార్థాలు, సలాడ్లను ఎంచుకోవాలి. హోల్‌వీల్ పాస్తా, దంపుడు బియ్యం ప్రయత్నించొచ్చు. మాంసకృతులుండే ఆహారాన్ని తీసుకోవడం వల్ల కొద్దిగా తిన్నా పొట్టనిండిన భావన కలుగుతుంది. ఇవి కండరాల నిర్మాణానికి తోడ్పడతాయి. రోజుకు దాదాపు 40 నుంచి 50 గ్రాముల మాంసకృత్తులు (60 కేజీల వ్యక్తికి) అవసరమవుతాయి. ఇందుకోసం స్కిన్‌లెస్ చికెన్, చేపలు, గుడ్లు, బీన్స్, టోఫూపనీర్, పాలఉత్పత్తులు నిత్యం ఆహారంలో ఉండాలి. కండ



రాలు, గుండె పనితీరు కోసం పొటాషియం కావాల్సిందే. రోజూ కప్పు పెరుగులో పండ్లముక్కలు వేసుకుని తినాలి. దాంతో పాటు రెండున్నర కప్పుల తాజా ఆకుకూరలూ, అందేలా చూసుకోవాలి.

## 30-40లో

పిల్లలు, ఇల్లు, ఆఫీస్... లాంటి పనులతో ఈ వయసులో ఒత్తిడి సహజమే. వ్యక్తిగత ఆరోగ్యాన్నీ నిర్లక్ష్యం చేస్తారు. పోషకాహారంపై దృష్టిపెట్టరు. కానీ అవసరం. ముఖ్యంగా పాలు తాగాలి. అల్పాహారానికి సమయం లేనివారు..తృణధాన్యాల పొడి, కొన్ని ఎండుఫలాల చూర్ణం కలిపి జావలా చేసుకుని తాగితే శరీరానికి శక్తి అందుతుంది. ఓ పండూ తినొచ్చు. రోజూ రెండుపూటలా భోజనం మానేయకూడదు. అన్నం తక్కువగా కూరగాయలు, పప్పు ఎక్కువగా ఎంచుకుంటే బరువూ అదుపులో ఉంటుంది. రాత్రిళ్ళు కిచిడీ ప్రయత్నించొచ్చు. ఆహారానికి సంబంధించిన వారం మొదట్లోనే ప్రణాళికను రూపొందించుకుంటే ఒత్తిడి ఉండదు. సాయంత్రాలు పల్లీల్లాంటివి ఉడికించుకుని తింటే మాంసకృత్తులు అందుతాయి. గర్భధారణ సమయంలో పెరిగిన బరువును వీలైనంత త్వరగా తగ్గించుకుంటే అధిక రక్తపోటు, మధుమేహం లాంటివి రావు. ఎలాంటి ఆహారం అంటే....గర్భం దాల్చాలనుకునేవారు ఫోలేట్‌ను తప్పనిసరిగా ఆహారంలో చేర్చుకోవాలి. ఇది శరీరంలో కొత్త కణాల ఏర్పాటుకు తోడ్పడుతుంది. గుండె జబ్బులు రాకుండా నియంత్రిస్తుంది. బఠాణీలు, పాలకూర, బ్రకోలీ, నారింజ, తృణధాన్యాలను తీసుకోవాలి. ఇనుము లోపం ఎదురుకాకుండా మాంసం, పొట్టుతీయని పప్పులు, సోయా బీన్స్ గుమ్మడి విత్తనాలు, చికెన్‌ను ఆహారంలో చేర్చుకోవాలి.

## 40-50లలో...

ఈ వయసు వారు మోనోపాజ్ మొదటి దశలో ఉంటారు. మధుమేహం, అధికరక్తపోటు వంటివి వచ్చే అవకాశాలు ఎక్కువ.



వీటికి తోడు బరువు తగ్గడం అంత సులువు కాదు. జీవక్రియల వేగం తగ్గడమే అందుకు కారణం. ఎలాంటి ఆరోగ్య సమస్యలు లేకపోతే సాధారణంగా అందరిలాగే ఆహారం తీసుకోవచ్చు. అయితే మితంగా, ఎక్కువసార్లు తినాల్సి వుంటుంది. మూడు పూటలా ఆహారం, రెండుసార్లు చిరుతిళ్ళు ఉండేలా చూసుకోవాలి. యాభైల్లోకి వచ్చే ముందు ఈస్ట్రోజెన్ స్థాయిలు తగ్గుతాయి. ఫలితంగా హార్మోన్ల మార్పులు వస్తాయి. మెనోపాజ్ దశకు చేరుకునేకొద్దీ ఎముకల సాంద్రత తగ్గుతుంది గనుక కాల్షియం తప్పనిసరి.

ఎలాంటి పదార్థాలంటే...మీగడ తీసిన పాల పదార్థాలు, సప్లిమెంట్ల ద్వారా కాల్షియం పొందొచ్చు. విటమిన్-డి కోసం వైద్యులు మాత్రల్ని సూచిస్తారు. పీచు ఉండే ఆహార పదార్థాలను తీసుకుంటే కొవ్వు పేరుకోకుండా చూసుకోవచ్చు. పండ్లు, కూరగాయలు, బార్లీ, ఓట్స్, తృణధాన్యాలు, దంపుడుబియ్యం, గుడ్డు తెల్లసొన వంటివి తీసుకోవాలి.

**50 నుంచి ఆపై...**

హార్మోన్లలో తేడాలొస్తాయి. నీరసం ఆవహిస్తుంది. కాబట్టి ఈస్ట్రోజెన్ అధికంగా ఉండే ఆహారాన్ని తీసుకోవాలి. కాల్షియం అవసరమూ ఎక్కువవుతుంది. అనారోగ్యాలు ఉంటే తదనుగుణంగా ఆహారంలో మార్పులు చేసుకోవాలి. ఎలాంటి పదార్థాలంటే... తక్షణ శక్తిని అందించే డ్రైఫ్రూట్స్, నట్స్‌ని రోజూ పదివరకు తీసుకోవచ్చు. సోయా పాలు, సోయాపనీర్, నగ్గెట్స్.... వంటివి తీసుకుంటో ఈస్ట్రోజెన్ అందుతుంది. శెనగలు, రాజ్మా, పప్పు దినుసులు, ఆకుకూరలు, నువ్వులు, పల్లీలు, బాదం రోజూ తీసుకుంటే మంచిది. రాత్రిపూట భోజనం మానేయాలనుకుంటే గోధుమరవ్వ ఉప్మా, కిచిడీ వంటివి చేసుకోవచ్చు.

# కర్నూలు అర్బన్‌లో కార్యకర్త తొలగింపు

## వికలాంగ బాలికలను హింసించిన కారణంగా క్రిమినల్ కేసు నమోదు

కర్నూలు జిల్లా కర్నూలు అర్బన్ ప్రాజెక్టు పరిధిలోని వన్ సెక్టార్‌కి చెందిన కార్యకర్త సావిత్రి స్థానిక మంగళగిరి ఎంఎం దర్గా అంగన్‌వాడీ కేంద్రంలో విధులు నిర్వర్తిస్తుంది. ఈమె సెంటరుకి ఒక మూగ చెవిటి చిన్నారి క్రమం తప్పకుండా వస్తుంది. కాగా ఒకరోజు ఈ మూగ చెవిటి బాలిక తనకు తెలియకుండానే అంగన్‌వాడీ కేంద్రంలో మూత్రవిసర్జన చేసింది. దానితో ఆగ్రహించిన కార్యకర్త సావిత్రి వాతలు తేలేవరకు చితక బాదింది. అప్పట్లో ఈ వార్త ఆ ప్రాంతంలో సంచలనం అయ్యింది. ఐసిడిఎస్ ఉన్నతాధికారులు సైతం స్పందించి వివరాలు అడిగి తెలుసుకున్నారు. వికలాంగురాలైన బాలికను విచక్షణ రహితంగా చావగొట్టడం దారుణమని ప్రతివారు చర్చించుకున్నారు. అయితే ఈ విషయం జిల్లా కలెక్టర్ సైతం స్పందించి, నిబంధనలు అనుసరించి ఆ కార్యకర్త సావిత్రిని విధుల నుండి తొలగించటమేకాక క్రిమినల్ కేసు సైతం ఫైల్ చెయ్యాలని పేర్కొన్నారు. దీనితో స్థానిక సిడిపిఒ వరలక్ష్మి సదరు కార్యకర్తను ఉద్యోగం నుండి తొలగించింది. చాలా జిల్లాల్లో క్రమశిక్షణ పేరుతో అంగన్‌వాడీకి వచ్చే చిన్నారులను చాలా దారుణంగా హింసిస్తున్నారు. ఆటపాటలతో కూడిన విద్యనందించవలసిన కార్యకర్తలు విచక్షణారహితంగా వాతలు సైతం పెడుతున్నారు. క్రమశిక్షణ పేరుతో అక్రమ శిక్షణలు విధిస్తే పరిస్థితులు ఇలా ఉంటాయి అనటానికి నిదర్శనం కర్నూలు అర్బన్ ప్రాజెక్టులో పనిచేస్తూ విధుల నుండి శాశ్వతంగా తొలగింపబడిన సావిత్రి అనే చెప్పాలి. కాబట్టి అంగన్‌వాడీ కార్యకర్తలు పిల్లలు విషయంలో జాగ్రత్తగా ఉండాలి. క్రమశిక్షణ నేర్పాలి. పద్ధతి ప్రకారం తప్ప హద్దులు మీరి ప్రవర్తిస్తే ఇలానే ఉంటుంది.


### అంగన్‌వాడీ వాయిస్ పత్రిక పాఠకులకు

పశ్చిమగోదావరి జిల్లా ఏలూరు కేంద్రంగా స్వరం మీది పోరాటం మాది అనే నినాదంతో రాష్ట్రమంతా వెలువడుతున్న అంగన్‌వాడీ వాయిస్ సామాజిక ప్రజాచైతన్య మాసపత్రిక చందాదారులుగా చేరాలనుకునే వారు వార్షిక సభ్యత్వం అనగా పత్రిక సాలుసరి చందా రూ. 250/-లు ఈ క్రింది అకౌంట్ నెంబర్‌లో జమ చేసి మీ అడ్రస్ ఈ క్రింది సెల్‌ఫోన్ నెంబర్‌కు వాట్సప్‌లో మీ చిరునామా పంపినట్లయితే పోస్టు ద్వారా క్రమం తప్పకుండా ప్రతి నెల మీరు ఇచ్చిన అడ్రస్‌కే పుస్తకం అందుతుంది. చిరునామా స్పష్టంగా ఇంటి నెంబరు, వీధి పేరు, పోస్టు, మండలం, పిన్‌కోడ్ నెంబర్‌తో సహా ఉండాలి. గమనించగలరు.

**ఎడిటర్ - సెల్ : 94401 41712**

**ఆంధ్రాబ్యాంక్, బ్యాంక్ ఖాతా నెం. 107111100001273 ఐఎఫ్ఎస్‌సి కోడ్ ANDB 0001071**

# మహిళలకు సత్వర న్యాయం కోసమే 'దిశ' స్టేషన్లు

**ఆహ్లాద వాతావరణంలో కౌన్సెలింగ్ గది * స్టేషన్ ప్రారంభంలో కలెక్టర్, అర్బన్ ఎస్పీ**

మహిళలకు సత్వర న్యాయం అందించేందుకు 'దిశ' మహిళా పోలీస్ స్టేషన్లు ఏర్పాటు లక్ష్యమని కలెక్టర్ నారాయణ భరత్ గుప్తా, తిరుపతి అర్బన్ ఎస్పీ ఆవుల రమేష్‌రెడ్డి అన్నారు. చిత్తూరు, తిరుపతి నగరాల్లో కొత్తగా ఏర్పాటు చేసిన దిశ పోలీసు స్టేషన్లు ఇటీవల ప్రారంభమయ్యాయి. తిరుపతి స్టేషన్ ప్రారంభంలో ఎస్పీ సతీమణి సుష్మా రెడ్డి కూడా పాల్గొన్నారు. ఈ సందర్భంగా కలెక్టర్ మాట్లాడుతూ మహిళలు తమ సమస్యల పరిష్కారం కోసం దిశ పోలీసులను సంప్రదించాలని, ఇక్కడే కౌన్సిలింగ్ సెంటర్ ఏర్పాటు చేశారని పేర్కొన్నారు. మహిళలు న్యాయం కోసం వచ్చినప్పుడు కౌన్సిలింగ్ సమయంలో చిన్నపిల్లలకూ సంరక్షణ గది అందుబాటులో వుంటుందని అన్నారు. మహిళలకు అన్యాయం జరిగినప్పుడు ఎదుర్కొని ఉన్నత స్థాయికి ఎదగాలనే ఉద్దేశంతో ప్రభుత్వం ఎన్నో చర్యలు తీసుకుంటోందని తెలిపారు. అర్బన్ జిల్లా ఎస్పి రమేష్‌రెడ్డి మాట్లాడుతూ ప్రజలకు, మహిళలకు స్నేహపూర్వకంగా పోలీస్ వ్యవస్థ పనిచేస్తున్నదని, మహిళలకు బాధ్యతతోపాటు రక్షణ కల్పించే దిశగా 'దిశ' మహిళా పోలీస్ స్టేషన్లు ఏర్పాటు చేశామని చెప్పారు. ఏ సమయంలోనైనా 24x7 ఏ సహాయానికైనా, సహాయం పొందడానికి మహిళలు వెనుకాడరాదని భరోసా ఇచ్చారు. దిశ మహిళా పోలీస్‌స్టేషన్‌లో మహిళా పోలీసు అధికారులతో కలిపి 33 మంది సిబ్బందిని నియమించామని వివరించారు. మహిళలకు ఇది ఒక వరం లాంటిదని, సిఎం జగన్మోహనరెడ్డి ప్రవేశపెట్టిన దిశ చట్టం అమలుకు చిత్తశుద్ధితో విధులను నిర్వహిస్తామని హామీ ఇచ్చారు. దిశా చట్టం ద్వారా బాధిత మహిళలు, బాలికలకు ఎల్లవేళలా సహాయ సహకారాలను అందిస్తామన్నారు. సమస్య ఏదైనా ఒక అడుగు మహిళలు ముందుకు వస్తేనే సమస్యలు పరిష్కారం అవుతాయని తెలిపారు. టిటిడి సివిఎస్ ఓ గోపీనాథ్ జట్టీ మాట్లాడుతూ ప్రముఖ పుణ్యక్షేత్రంలో దిశ మహిళా పోలీస్‌స్టేషన్ అవసరమని, దేశ విదేశాల నుంచి వచ్చే భక్తులకు కూడా ఉపయోగంగా ఉంటుందని అన్నారు. మహిళల భద్రత లక్ష్యంగా పోలీస్ వ్యవస్థ పనిచేయనున్నదని తెలిపారు. మహిళా దినోత్సవం రోజున ప్రారంభించుకోవడం శుభపరిణామమన్నారు. అనంతరం మహిళా పోలీస్ వాలంటీర్లు, పోలీస్ కుటుంబ సభ్యులతో రాష్ట్ర డిజిపి గౌతం సవాంగ్ వీడియో కాన్ఫరెన్స్ ద్వారా పలకరిస్తూ సదుపాయాల గురించి అడిగి తెలుసుకున్నారు. ఈ కార్యక్రమాల్లో తిరుపతి అడ్మిన్ అడిషనల్ ఎస్పి సుప్రజ, క్రైమ్ అడిషనల్ ఎస్పి వెంకటేశులు నాయక్, తిరుమల అడిషనల్ ఎస్పి మునిరామయ్య, ఎస్బిడిఎస్పి గంగయ్య, మహిళా డిఎస్పి వెంకటేశ్వరరావు, డిఎస్పిలు ఈస్ట్ మురళీకృష్ణ, వెస్ట్ నరసప్ప, క్రైమ్ రామమోహన్, ఎస్సి ఎస్టి సెల్ మురళీధర్, నాగసుబ్బన్న, ఎఆర్ విభాగం నందకిశోర్, హోంగార్డ్ విభాగం లక్ష్మణకుమార్, సిఐలు, ఆర్ఐలు, ఎస్ఐలు, ఆర్ఎస్ఐలు మహిళా సిబ్బంది, మహిళా పోలీస్ వాలంటీర్లు పాల్గొన్నారు.




'అంగన్‌వాడీ వాయిస్'
సామాజిక ప్రజా చైతన్య మాసపత్రికకు
వార్షికోత్సవ శుభాకాంక్షలు
అంతర్జాతీయ మహిళా దినోత్సవ శుభాకాంక్షలు

సిడిపిఒ మరియు సిబ్బంది
పర్యవేక్షకులు, కార్యకర్తలు, హెల్పర్లు
ఐసిడిఎస్ ప్రాజెక్టు, గుడివాడ, కృష్ణా జిల్లా

స్త్రీ లేకపోతే జననం లేదు...
స్త్రీ లేకపోతే గమనం లేదు...
స్త్రీ లేకపోతే సృష్టిలో జీవం లేదు...
స్త్రీ లేకపోతే అస్సలు సృష్టే లేదు...




‘అంగన్‌వాడీ వాయిస్’కు
5వ వార్షికోత్సవ శుభాకాంక్షలు





అమ్మను పూజించు..
భార్యను ప్రేమించు...
సోదరిని దీవించు...
ముఖ్యంగా మహిళను గౌరవించు...

అంతర్జాతీయ
మహిళా దినోత్సవ
శుభాకాంక్షలు



**సిడిపిఓ మరియు సిబ్బంది**

**ఐసిడిఎస్ ప్రాజెక్టు, కొత్తూరు, శ్రీకాకుళం జిల్లా**


అంతర్జాతీయ మహిళా దినోత్సవ శుభాకాంక్షలు


‘అంగన్‌వాడీ వాయిస్’కు వార్షికోత్సవ శుభాకాంక్షలు

అర్థం చేసుకునే నేర్పు...
అంతులేని సహనం...
సాధించగలిగే మనోబలం...
గుండెలో దాచుకునే ఔదార్యం...
అదే ఆమెలోని అందం...



**సిడిపిఓ మరియు సిబ్బంది**

**ఐసిడిఎస్ ప్రాజెక్టు, వీరఘట్టం, శ్రీకాకుళం జిల్లా**

# అంతర్జాతీయ మహిళా దినోత్సవ శుభాకాంక్షలు






## 'అంగన్‌వాడి వాయిస్'
## సామాజిక ప్రజా చైతన్య మాసపత్రికకు
## 4వ వార్షికోత్సవ శుభాకాంక్షలు



స్త్రీ లేకపోతే జననం లేదు...
స్త్రీ లేకపోతే గమనం లేదు...
స్త్రీ లేకపోతే సృష్టిలో జీవం లేదు...
స్త్రీ లేకపోతే అస్సలు సృష్టే లేదు...



# అభివృద్ధిపథంలో విశాఖ జిల్లా
# మహిళా శిశు సంక్షేమ శాఖ, విశాఖపట్నం

## ఐసిడిఎస్ ఉద్దేశ్యాలు

- 0-6 సంవత్సరాల వయస్సులోపు పిల్లల పోషణ మరియు ఆరోగ్య స్థాయి మెరుగుపర్చడం.
- శిశువు మానసికంగా, శారీరకంగా, సామాజికంగా ఆరోగ్యంగా పెరిగడానికి తగిన పునాది వేయడం.
- శిశు మరణాల రేటును పిల్లల పోషకాహార లోపాన్ని అనారోగ్య పరిస్థితులను పాఠశాల మానివేతను తగ్గించుట.
- శిశువును ఆరోగ్యంగా పెంచడంతోనూ పిల్లల ఆరోగ్య పోషక అవసరాలకు అనుగుణంగా సరైన పోషణ సమకూర్చడంలో తల్లికి తగు శిక్షణ ఇచ్చి నైపుణ్యాన్ని పెంపొందించడం.
- ఈ పథకాన్ని విజయవంతంగా అమలు పరచడానికి పిల్లల అభివృద్ధికై కృషి చేస్తున్న వివిధ శాఖల మధ్య సమన్వయం సమకూర్చడం.

## ప్రాజెక్టు డైరెక్టర్ మరియు సిబ్బంది
## సిడిపివో, ఎసిడిపిఒలు
## సూపర్‌వైజర్లు, కార్యకర్తలు, ఆయాలు

BCi

K RS A101 M 103

Anganwadi Voice MARCH 2020 RNI APTEL 2016/71924, Postal Licence : SP/ELR/002/2020-22




# అంతర్జాతీయ మహిళా దినోత్సవ శుభాకాంక్షలు



'అంగన్‌వాడి వాయిస్' సామాజిక ప్రజా చైతన్య మాసపత్రికకు

4వ వార్షికోత్సవ శుభాకాంక్షలు






మన శాఖలో ఉద్యోగులు ఎన్నో ఏళ్ళుగా పదోన్నతులు లేక మానసికంగా కృంగిపోతున్న తరుణంలో మంత్రివర్యులు శ్రీమతి తానేటి వనిత M.Sc., గారు స్పందించి ప్రమోషన్లు ఇచ్చిన సందర్భంగా మంత్రివర్యులకు, సెక్రటరీ గార్కి, డైరెక్టర్ మేడమ్ గార్కి, వారి సిబ్బందికి హృదయపూర్వక ధన్యవాదములు

## AP EMPLOYEES OF WOMEN DEVELOPMENT & CHILD WELFARE DEPARTMENT ASSOCIATION

(Regd. No. 264/1979)

(Recognized by Govt. of AP vide G.O. Ms.No. 325, Dt. 01/05/1980 of GA (Service) Department

D.No. 54-16-1/49, Beside Agape Church, Vetarnery Colony, Loyola Degree College Road, VIJAYAWADA - 8, E-mail : apwdcwngo@gmail.com

| | | | |
|---|---|---|---|
| ఎ. సుబ్బరాజు<br>రాష్ట్ర అధ్యక్షులు | ఎస్. విద్య<br>జనరల్ సెక్రటరీ | జె. సత్యనారాయణ<br>అసోసియేట్ ప్రెసిడెంట్ | సిహెచ్. శ్రీరామ్<br>కోశాధికారి |
| కె. మంజులవాణి<br>ఉపాధ్యక్షులు | ఎ.జె.ఎం. రాధాకృష్ణ<br>ఉపాధ్యక్షులు | బి. ఆంధ్రజ్యోతి<br>ఉపాధ్యక్షులు | వి. చంద్రారెడ్డి<br>ఆర్గనైజింగ్ సెక్రటరీ |
| ఎ. శేషాచార్యులు<br>జాయింట్ సెక్రటరీ | పి.ఆర్. ఇవాంజిలిన్<br>జాయింట్ సెక్రటరీ | డి. బాబా నూరుద్దీన్<br>జాయింట్ సెక్రటరీ | ఆర్. వసంతలక్ష్మి<br>ఈసి మెంబర్ |
| వై.ముని లక్ష్మి<br>ఈసి మెంబర్ | వి.వి.కె.ఎస్.కె. కుమారి<br>ఈసి మెంబర్ | పి.ఎస్. అఫ్రాజ్ బాషా<br>ఈసి మెంబర్ | కె. నాగరాజు<br>ఈసి మెంబర్ |

డి. శ్రీనివాసులు
ఈసి మెంబర్

BC



మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | **KRSA101M103** |
| పుస్తకం పేరు | అంగన్ వాడి |
| తారీఖు | **23 February 2025** |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 69 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Vedavathi |
| పేజీలు విడదీసినది | Vedavathi |
| స్కాన్ చేసినది | Showmila |
| పరీక్ష చేసినది | HEMA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |